# రామరాజ్యము

" మధుర మధురాల కవి " యని బుధులుపొగడ
నొప్పువాడ తీయనికైత చెప్పువాడ
విమల విజ్ఞాన సాహితీ పీఠిపైన
వాణి నారాధనముచేయు వైణికుడను.

" కావ్యశిల్పి "

మధుర మధురాలు

# కైమోడ్పు

కరుణరసము పొంగి కట్టలు త్రెంచుక
శోకమెవని యెడద శ్లోకమయ్యె?
అట్టి యాదికవికి నమర వాల్మీకికి
కేలు మోడ్చువాడ చాలభక్తి.

తెలుగుం పొలాన కవితో
జ్వల సస్యములెల్ల చల్లి జాతీయములన్
పలుకుం తేనెల జిలికిన
కులరత్నము నన్నయార్యుగొలుతు ప్రణతినై.

# సమర్పణ

శ్రీ పోతరాజు విశ్వనాథశర్మగారి షష్టిపూర్తికి

హృదయపూర్వకంగా....

## అంజలి

నరునికి నారాయణుని మాదిరిగా సాహిత్యలోకంలో సహకరించిన శ్రీ ఒబ్బిళ్లపల్లి కామేశ్వరరాయ కవిగారికి. ముచ్చటగా ముద్రించి ఇచ్చిన శ్రీ మండా అంజనేయులునాయుడుగారికి, ముద్దులొలుకు ముఖచిత్రం గీసియిచ్చిన శ్రీ మోహనరావుగారికి, వాణీ ప్రెస్ పనివారలకు—

# వెన్నెల

" మధుర మధురాల కవి " అను కలంపేరుగల శ్రీ వావిలి కొలను లక్ష్మీనరసింహారావుగారి రచన ఆపాతమధురమై ప్రతిజ్ఞానామ మగు "మధుర మధురాలు" పదం పదంలో కదనుత్రొక్కించుచున్నది. " రామరాజ్యము " అను కావ్యానామాన్ని ఎన్నుకొనుటలో బహువిధ ప్రజ్ఞ ద్యోతకమౌతున్నది. పాఠకులకు మంజులాలు, సుస్నిగ్ధాలు, సుందరాలు, మరందాలు, పుష్పోడులు కనుల గట్టించి అనితరభావావేశంతో తన కవిత్వ సుందరిచే పసిడిమువ్వల చిరునాట్యం చేయించే కళాపటిమ యీ కవికున్నది. కావ్యం చేతబట్టిన పాఠకులు గుహుడై, శబరియై, ఉషుతయై, ఆ యా పాత్రాశిల్పంతో తాదాత్మ్యం పొంది తీరుతారు. ఋతువర్ణనలలోగూడా క్రొంగ్రొత్తబాటలను త్రొక్కి కావ్యలేఖినితో చిత్రించి తీరుతీయముల నొలికించుట ఎన్నదగిన విషయం ద్రాక్షాపాకంలో అసదృశ గంగాభంగతరంగ సంగీత ఘుమంఘుమార్భటులతో కావ్యాన్ని దిద్ది తీర్చి రసికలోకానికి భిక్ష పెట్టుచున్న యీకవి తాను ధన్యుడగుటయేగాక పతితలనుగూడా చరితార్థులను చేశారు. సాహిత్యలోకంలో జిలుగువెన్నెలలు చిందే మధురగీతాలు వీణె తంత్రులపై పలికించి కీర్తి సుందర సువర్ణసౌధము నిర్మిస్తుందని భావిస్తాను.

" హర్షశ్రీ "

# అనుభూతి

భాస్కరుండు పలికె పంచదారలపోల్కి
మొల్ల పలికె జాజిమల్లెభాతి
ఎందరెన్ని గతుల నెన్నిన తృప్తియే
రామచరిత అక్షరామృతంబు.

భక్తిరమకు బాట పలుక తేనియ తేట
ముక్తిగృహము ప్రక్క మొగలిమొక్క
సుధకు మిన్న రాముకథకన్న వేరేది
స్వర్ణ చరిత కవికి సంతరించు.



# మున్నుడి

చిరంజీవి మా బావమఱది సుబ్బారావు యీ ' కావ్యానికి " శ్రీకారం చుట్టాడు. నేనొక ఆకారం యిచ్చాను. ఛప్పన్నారుదేశాల్లో ముప్పైఆరుభాషల్లో తన మృదుమధుర మంజులమైన యితి వృత్తాన్ని రాగ, తాళ, బద్ధంగా, వ్యాకరణశుద్ధంగా అమరగానం చేయించుకొని నోట ఊటల ఊరించుకొనిన శ్రీరామచంద్రమూర్తి కలంపట్టి వ్రాయిస్తే ఆయన చెయ్యమన్నమార్పులు, కూర్పులు, చేర్పులు, తీర్పులు చేశాను. యథామూలం కాదని, సుధాలాపంగా లేదని, చెఱకుకు వంకలు పెట్టే వారికి జేజేలు– జిలుగు నిగ్గులు కులికినా, తేనెబుగ్గలు ఒలికినా, పసిడి గజ్జలు మ్రోగినా, పన్నీటి జల్లు సాగినా కావ్యశిల్పి శ్రీరామచంద్ర వర ప్రసాదంగా భావించ రసికాలోకానికి నమోవాకాలు.

# నివాళి

శ్రీ కుసుమామనోహరుని సేవితపత్నుల నాల్గుచిత్తు, నా
శీక భవాది దేవతల లీల జగంబుల నోముహాని సు
శ్లోకుని మంజులంబయిన సూర్తులు గూర్చిన వాని పాటమాల్
సోకశిరంబుమోపి దయజూడగ శ్రీ హరినాథు గొల్చెదన్.

వాణి కవిత్వవైఖరుల పన్నెలు చిన్నెలుగల్గురాణి గీ
ర్వాణి కుమారిపద్మముల రక్షణసేయు నిసర్గపాణి పూ
బోణి చతుర్ముఖ ప్రణయపూర్ణ హృదంతర జాతయౌ కళా
శ్రేణిని గాంచెదన్ వినుతిజేసెద మత్కృతిపన్నెలెక్కగన్.

పచ్చిక పూజకై కరముపట్టును కొబ్బరిముక్క నిచ్చుచో
మచ్చికచెంది కష్టములు మాన్చును కొక్కునునెక్కి విఘ్నముల్
బుచ్చగ పర్వులెత్తునని పూనిక మానక భక్తిభావముల్
మెచ్చగ కేలుమోడ్చి నుతియించెద విఘ్నవిభున్ వినాయకున్.

కాళిదాసు అమరకావ్య మంజులభాషు
భట్టబాణు సుకవి పట్టభద్రు
మధురకవిని మాఘు బుధజన సందోహు
నెంతు మృదులశైలి నిచ్చుకొరకు.

పదపదంబు ద్రాక్షఫల మధురంబును
మాటమాట తేనెయూటగాగ
పలుకునట్టి మిన్న బమ్మెర పోతన్న
దలతు కావ్యరసము చిలుకుకొరకు.

చిక్కని పలుకులలో పెం
పెక్కిన కవితా వినోద ప్రియభాషణలన్
యెక్కువ వా రనదగు మా
తిక్కన యెఱ్ఱనల దలతు తెనుగు నుడులిడన్.

సుకృతి మాఘ కావ్య సురుచిర నిర్మాత
మధుర కవివరుండు మాతులుండు
లక్ష్యగురువునాకు లక్ష్మీనృసింహుండు
పోతరాజు వంశ శీతకరుడు.

సచివసత్తముండు సహజ కవీంద్రుండు
కొప్పరంపు కవుల గురువరుండు
పోతరాజు రామబుధుడు మాతామహు
డంజలింతు నతని కధికభక్తి.

కృతిముఖాన నెంతు మతిమంతు జాతీయ
కాంగ్రెసాజ్ఞ యీయ కారకరిగి
అచ్చ సేవజేయు స్వచ్ఛంద సేవకు
విశ్వనాధశర్మ విమలభక్తి.

హరనాధున్ గురునాధుఁజేసి కవితా ప్రారంభమొందించి యీ
సరికిన్ పెక్కు సమల్ గతించినవి నా స్వాంతంబు శాంతంబుగా
విరచింపంబడలేదు కావ్యము సుధావిష్యందమానంబుగన్
సరసుల్ మెచ్చ రచింతు తేనియలుచిందన్ అంద మింపొందగన్.

ఆత్మభౌతికముల కాధారభూతులౌ
మాతృ పితృవరులను మాన్యమతుల
మహిత భక్తిదలతు మహాలక్ష్మీమూర్తి శ
ర్మాభిధులను సద్గుణాకరులను.

వాసుదాసు తాత వాల్మీకి విజ్ఞాత
సుబ్బరావు కావ్యసుధకుతావు
రాము కథను వ్రాయు స్వామిదాసుని మది
నిలుపువాడ భక్తి గొలుచువాడ.

రాగ పూర్ణ హృదయ రమణీయవర్తన
హైమవతియె నాదు నాత్మపత్ని
సుతులులేరు కలరు సుతలు మూవురు నాకు
పిన్నవారు కూర్మి గన్నవారు.



# గురుపూజ

పదిపదునారు వర్షముల ప్రాయమునందున కాంగ్రెసాజ్ఞయై
నదివిని కారకున్ జనగ నందరికన్నను ముందుదూకె దా
జదివినవిద్య సార్థకతనల్పగ నిల్పెను తండ్రిపేరుతో
సదమలమైన పుస్తకపు సంపుటులుండిన గ్రంథధామమున్.

కవితలుసెప్పె కన్నియల కట్నపుగాంచెను వారిపెండ్లివై
భవమునుజూచి తృప్తిగనె పావనిధాము పుత్రప్రతిష్ఠలన్
భవజలధిం తరించె పరిపాండుర సుందరకీర్తి చంద్రికా
నివహములన్ దిగంతములు నింపెను, నిల్చెను ధన్యజీవియై.

ఉల్లము జల్లన తావులు
కొల్లలుగొన అమల ప్రేమ కొనలూరగ తా
చెల్లించె పితృణము మగ
పిల్లల నల్వురను గాంచి ప్రియభాషణులన్.

కర్మయోగియైన గాంధి సద్భక్తుండు
విశ్వనాథశర్మ విమలగుణుడు
దొరకె కావ్యకన్య కరమునుబట్టంగ
భాగ్యమెల్ల నిటుల పండెననగ.

మా కవితాకుమారి సుకుమారి మరంద మనోజ్ఞ వీచికా
నీక సుధావలోక కమనీయ కళామయ కాంతి రేఖికా
లోక విలోకముల్ బరపి లోగొను మీ అనురాగ వల్లికా
స్తోక సుమ ప్రపంచములతో నిలువెల్లను జల్లు జల్లనన్.

పూతము పోతరాట్కుల సముద్రము అందున కల్పవృక్షమై
శ్రీ తనరారువాని శుభశీలుని శాంతుని దైవభక్తియున్
నీతియు భూషణంబులుగ నిల్చిన మాతులు విశ్వనాధ వి
ఖ్యాతుని ప్రీతిపూర్వకుని గణ్యుని మత్కృతిభర్త జేసెదన్.

జనకుడు నొజ్జయు భార్యను
గను తండ్రియు అన్న దాత క్ష్మాపతియను నీ
ఘనులైదుగురును తండ్రులు
చన దెటు వారల ఋణంబు జగతి బలంబై.

మామ మంజుగుణుడు మాన్యుండు ధన్యుండు
కీర్తికామి త్యాగమూర్తియగుట
రాఘవునకు ఉడుతలాగున మృదుభక్తి
కావ్యకన్య నిచ్చి కాంతు ముక్తి.

కన్నసుతను గంగకడలి నాధునకిచ్చి
అతని కూతు లక్ష్మి హరి భరించె
మామ అల్లులకును మమతలు బంధాలు
జగతినిటుల చెడక సాగుననగ.



# రామరాజ్యము



పచ్చని ద్రాక్షలో విరియబండు ననంటులో యిక్షుసారమో
అచ్చపు తేనెయో సుధయొ అన్న తెరుంగున శైలకన్యతో
ముచ్చట జెప్పి రాముకథ ముక్తికి బత్తి ప్రపత్తి యన్న ప
ల్కచ్చుపడంగజేయు భవుడాదుత భక్తుల ప్రేమదృక్కులన్.

పంటవలంతికిన్ నొసట భాసిలు కస్తురి బొట్టుభాతిగా
నుంట నయోధ్య జానపద నూపురమై విలసిల్లు యేలికై
దంట విరోధి వర్గముల ధాటిని మాటికి మీటుశౌర్య పుం
బంటు కలండు పంక్తిరథ పార్థివు డర్థికి కల్పకంబనన్.

కోటులు చూడగా సుభటకోటులు స్యందన ఘోటకమ్ము లా
పాటవ సత్వవై ఖరుల పర్వతరాజము లంగనా ప్రజం
బాటల పాటలన్ దివిజభామల కోమల చారుశీలమున్
పాటికి సేయ రాపురి సుపర్వుల వీటికి దీటుగోటునన్.

పూవులు చాల వీధులనుబోసి క్రయార్థమురాగ జాణలై
తావులజిందు పల్కులను దన్పుచు ప్రేక్షక పాళి మోద సం
భావులజేసి అమ్మెదరు బాలలు చూపుల తేనె దృక్కులన్
ద్రావుచు కోడెగాండ్రు మది దల్పరు బేరములోని నేరమున్.

తేనియ యూటలో తరచి తీసిన మీగడ తేటలో సుధా
పానముకన్న మిన్నయగు పానకమో కలకండసారమో
దీనికి దీటటంచు తృషదీరుచు బావులనీరు ద్రావు వా
రానరు దేవతాసుధలనైన కడుంగడు నేవగింపునన్.

సతులు పరికింప దశరథక్ష్మావరునకు
కలరు కౌసల్యయు సుమిత్ర కైక లనగ
భోగ భాగ్యాలతో తుల తూగువారు
పూలతో నొప్పు కొలనులపోల్కిగాగ.

మూవురు భార్య లాతనికి ముచ్చట అచ్చట దీర్చు చిన్ని పూ
దీవెలు మేల్హాయల్ గలుగు తిన్నెలు వన్నెలలోన మిన్న లా
భావజు పత్నికిన్ వెఱగు బాటొనరించెడివారు కాని ఏ
దేవు మహాత్మ్యమో కలుగదేమియు సంతొక వింత శాపమై.

ఎంతటి భాగ్యమున్న ఫలమేమి నయంబిగురొత్త సేవలన్
సంతత మాచరించు పరిచారకులుండిన నేమి బ్రహ్మ క
ల్పాంతము రాజుగా భువిని పాలన చేసిననేమి పుత్రుడన్
చింతిత కామధేనువు వసింపని కొంపలు యిండ్లు నింపునే.

క్రతువులు చేసె దానము లఖండముగా నిడి భూమిదేవతా
తతిని పసిండి శాలువల దన్ని కృతార్థత జెందిరైననున్
సుతుడను చందమామ పొడసూపడు మాపడు వారి భారమౌ
వెత, గురుడౌ వసిష్ఠు కృప వేరుగనుండి మనంబు పండదో.

కొడుకులకై యొనర్ప దలకొంటదగున్ యిక పుత్రయజ్ఞమున్
నుడువులు కర్ణపాత్రికల నూత్న మరందము పోయుచుండ నా
యొడయడు ధీరవృత్తి క్రతువొప్పగ జేయగ పాయసంబుతో
బొడమెను వేల్పురాజు పరిపూర్ణ సుధామయ వృష్టిదోగగన్.

పాయసంబు మధుర ఫలచూర్ణ మిశ్రంబు
హేమ పాత్రనిచ్చి స్వామి పోవ
పంచి కుడిచి రమల పతిభక్తి భరితలు
ముగురు సతులు కూర్మి నిగురులెత్త.

ముందటిరాత్రి రాగరసమూనిన చిన్నె లనుంగుమోము పైన్
తందరలాడ ద్వారమున తారటలాడు ప్రియాంగి తేటిరా
నందుకు పెల్లు తాపమున నాతని రాకకు నందచందముల్
తొందరగా నొనర్చుకొని తోయజముల్ నిలుచుండె వాకిటన్.

నవనవ వసంతమున పెను
చివురులు పూవుల దనర్చి స్నిగ్ధతరంబౌ
చవులిడు ఫలవృక్షములన
యువిదలు ప్రసవించిరపుడు యుత్తమసుతులన్.

రాముడు లక్ష్మణుడనగా
భూమీశుడు పేర్లుపెట్టి పోషించె గుణో
ద్ధాముల పిన్నల భరతుడు
నా మరి శత్రుఘ్నుడనగ నమలప్రేమన్.

చిన్నరి చందమామలన జీవము దాల్చిన శిల్పిబొమ్మలో
అన్నవిధాన అకృతుల నందిన చిత్రములోయనంగ నా
చిన్ని నిసుంగులమ్మలకు చిత్తముదోచుచు చూచువారికిన్
కన్నులలోన వెన్నెలలు కల్పన జేసిరి పూలమాలలై.

గిలకలతోడ నవ్వు గిలిగింతకు కేతకిమొవ్వ అందముల్
జిలుక గులాబిపువ్వు తగుచిన్నెలు జూడగ సాంధ్యరాగ మా
జిలుగు తళత్తళాకలిత స్నిగ్ధమనోహర మూర్తి రాముతో
గలియుచు ఆటపాటలను కాలముబుచ్చిరి తోడిబాలకుల్.

లప్పలప్పలనుచు చప్పట్లు గొట్టును
పప్పపప్ప యనుచు చప్పరించు
గునిసి పసిడి గజ్జగులుక నాటలనాడు
గోముగోము గాగ రామమూర్తి.

కనులుపండె మనసు కట్టలుత్రెంచుక
పొంగిపొర్లి దుమికి నింగినంటె
చిన్నిసుతులు యింటనున్న భాగ్యముకల్గ
తల్లి దండ్రికింక తరుగుగలదె.

గజ్జలు పాదపద్మముల ఘల్లనిమ్రోయగ కల్పియిచ్చునా
గుజ్జనగూండ్లకై యురుకు, కూర్చొను తండ్రి మనోహరాంక మం
దజ్జనలాడు చిట్టికతలాతడు చెప్పగ నూహుయంచు తా
బొజ్జసియాఢనాడు చిరుబుగ్గలునొట్టలు బోవనవ్వుచున్

రాముడు చిన్ననాట నొకరామయొకించుకనెత్తికోగ మా
రామొనరించి పైనయుడురాజును చూపుచు తెచ్చియీయగా
రామొనరించె రాజెరిగి రాదదియన్న సుమంత్రుడద్భుత
స్థేముడు అద్దమందుగనజేసెను చందురుమందహాసమున్.

పెరిగి గురువునొద్ద గఱచిరి అఖిలాస్త్ర
కళలు నల్గురొక్క కాలమందె
పరిమళించుచున్న యుసుగుణాఢ్యుల బుద్ధి
లాక్షరసము ముద్రలక్షరాలు

శాంతుడు రాముడు కడు ధీ
మంతుడు లక్ష్మణుడు శౌర్యమున గంతులిడున్
ఎంతయొ దాంతులు కడు బల
వంతులు శత్రుఘ్న భరత పార్థివపుత్రుల్.

తామసి సృష్టికిఁ బదులు తాను ఘటించెడు రాజయోగి సు
త్రాముని గూడ లెక్కగనుదల్పనివాడగు గాధిజుఁడు రా
గా మనసేమితెల్పుడనుకంప కృతార్థుడనౌచు దీర్తు నో
స్వామియనన్ వచించె నిటు సంయమి గాంగఘనంఘునార్చటిన్.

జగము నుద్ధరించు భగవంతు గూరిచి
యజ్ఞకర్మ సేయు నవసరమున
చెనటి రక్కసులరు చనుదెంచి కూల్తురు
రాహుగ్రహము తీక్ష్ణబాహువోలె.

కావున రక్షసేయ తమ కన్నకుమారుల నస్త్రశస్త్ర మే
ధావుల బంపుడన్న సుతతాపము మోపయి కన్నుదమ్ములన్
గావిరి గ్రమ్మ బాష్పములుగారగ పంక్తిరథుండు విన్ననై
దేవ యిదేమి నేనరుగుదెంచెద త్రుంచెద దైత్యసంఘమున్.

అనిన కన్నులందు చినికెనిప్పులు ఋషి
కులగురుండు మేలుతెలిపి పంపె
రామ లక్ష్మణులను స్వామి వెన్వెంటను
మేఘచయము వెంట మెరపులట్లు.

బలయును అతిబలయును తా
తెలిపెను గాధేయుడమల తేజోఘనులౌ
జలజాప్త వంశభవులకు
లలితగుణ ప్రాభవుల కలఘు సత్త్వులకున్.

తాటకియన్న రాక్షసి ప్రతాప మహోరగి కౌశికాజ్ఞ నొ
క్కేటున ద్రుంచి యజ్ఞమున కెంతయుహాని నొనర్చునట్టి దు
ష్టేటుల సోదరద్వయము శీఘ్రశరంబుల గాడనేసి ఘో
రాటవిలోని రాయి నొక రామను జేసెను కాలిధూళిచే.

జనకుడు స్వయంవరంబని
మునికులు బిలువంగ రాజముఖ్యుల తోడన్
జనె గాధేయుడు మిథిలకు
కని దవ్వులనుండి రాజు కైమోడ్పు లిడన్.

గుణముల ప్రోవు నాయనుగుకూతురు స్వచ్ఛ జలంబుకన్న పా
వనమగుకాంత శాంత గురువత్సల సీత పరిగ్రహించగా
మనమున నెంచునట్టి నృపమండనులా కనుపించు చాపఖం
డన మొనరింపకున్నయడ స్వాంతము శాంతము కాదునేరికిన్.

అని జనకుడు వచియించిన
వినువారల గుండెలవిసె విల్లెక్కిడుటల్
మనపని గాదని దిక్కుల
గనుచుండిరి సభను విడిచి కాల్ కదలింపన్.

రాజులు తేజమందు రతిరాజులు అందమునందు వాహినీ
రాజులు ధైర్యమందు దినరాజులు తైక్ష్ణ్యమునందు సర్వరా-
ట్రాజులు పాండితీ ప్రతికి రాజులు కీర్తికి జాజులైన యీ
రాజ కుమారులెవ్వ రభిరాములటంచని చూచిరెల్లరున్.

విశ్వామిత్రుని వెంబడి
విశ్వాసము మూర్తిగొన్న విధమున సాక్షా
దశ్వని దేవతలనగా
శశ్వత్ప్రభు లిద్దరమల సత్త్వులు ప్రబలుల్.

వచ్చిన జనకరాజువంక నాజ్ఞకు జూచి
చేయిసాచి నారిజేర్చునంత
గంటలెల్ల గలసి ఘల్లుఘల్లురనంగ
విల్లురెండుగాగ విరిగిపోయె.

తనవిభుడెవ్వడోయనుచు తామరపై జలబిందువట్లుగా
తొణుకుచున్న భూమిసుత తొంగిలి రెప్పల కార్ముక క్వణ
క్వణనము రామచంద్రు కరకంజముచేసిన మేలుకొల్పులో
వినబడె వింతమూర్ఛనలు వేయి యొకేపరి వీణమ్రోతలన్.

ఇంద్రనీలము డాలు క్రిందు సేయగజాలు
కమనీయమగు మేని కాంతితోడ
శ్రీకారములవంటి యాకారమున నొప్పి
హాయినించెడు వీనుదోయితోడ
కలువల చెలువమ్ము నిలువ నీయగలేని
ముద్దుగారెడు నగుమోముతోడ
ఆజానులంబాలు అద్భుత స్తంభాలు
నగునట్టి బాహుల సొగసుతోడ

జాజిపూలకన్న జాబిలివలెనున్న
పాలవంటిరదన పంక్తితోడ
శ్యామసుందరుండు రాముడు వెలుగొందె
ప్రాణమున్న చిత్ర ప్రతిమ యనగ.

మా మకపుత్రి స్వచ్ఛమగు మంజుచరిత్ర సుగాత్రి సీత గా
రామునగొంట నా సుకృతి రాజిలియుంటయెకాన నీరద
శ్యామ కకుత్థ్సవంశ కలశాంబుధిసోమ త్వదీయ మంగళ
శ్రీమహనీయతన్ గుణ ప్రసిద్ధతగా మనమందు నెంచెదన్.

మంజులమైన మాహృదయ మందిర సుందరి ప్రేమవాటికిన్
అంజలి సింజితంబయిన అచ్ఛపువీణియ తేనెవాక హృ
త్కంజ మనోహరంబయిన తన్విని సీత వరించుమో మనో
రంజక రామచంద్ర రసరాజ మహేంద్ర జగద్ధితంబుగన్.

వంచెను విల్లు చూచు నృపవర్గము శీర్షము లిట్టెవంచి వీ
క్షించగ సీత చూపులను క్షిప్తముచేసిన తేనెతేట వ
ర్షించగ రాఘవుండు వరరీతిని పూతవిధిన్ గ్రహించె మే
లంచును దేవతావళి వలన్గొని పూవుల వాననింపగన్.

ముత్యాలు పూల యౌన్నత్యాలు స్తుత్యాలు
పన్నులై వన్నెలై చెన్నుగులుక
పగడాలు పుత్తడి జిగిడాలు మొగడాలు
రుచియౌచు శుచియౌచు ప్రచురపరుప
అందాలు మధుర మాకందాలు చందాలు
తళుకులై పలుకులై మొలకలీన
బాణాలు యువకుల ప్రాణాలు తూణాలు
యేపులై చూపులై గోపుచూప

పెన్నెరులచాలు తుమ్మెదనెన్నజాలు
కేలు బిసకాండముల తమినేలజాలు
చల్లనకు మంచు జాబిల్లి సొరునించు
స్మిత గుణమణి సంఘాతపూత సీత.

పూవులు ముత్తియంబులును బోసి జరీపని చేసి జాళువా
దీవులు పూన్చి జాలరులు దించి మరందము నించి మైథిలీ
దేవుడు తద్వి దేహపతి దీర్చిన పెండిలి మంటపాన రా
జీవ దళాక్షి సీతపయి సేసలు చల్లెను పొర్లుదోసిటన్.

జిలిబిలి జాబిలి శిఖపై
కలిగిన హరు కార్ముకంబు ఖండించి యశో
విలసితుడగు రాముడు గొనె
కలుముల చెలి సీత పసిడి కరకంజములన్.

శుభ మంగళ వాద్యంబులు
నభమదురగ మ్రోగ మౌనినాథుడు మంత్రాల్
గుభగుభ జదువగ మిక్కిలి
విభవంబున జరిగె పెండ్లి విధి సాంతముగన్.

జిలుగుం పుత్తడి వలువలు
పలుభూషలు రథచయాలు భామామణులున్
కులరత్నము లశ్వంబులు
కొలదికి మిక్కిలిగ నృపుడు కూతునకిచ్చెన్.

పొలయల్కనిశ యెల్లబుచ్చు పద్మినికాంత
ముంగొంగు మీగాళ్ళ మద్దుగొనగ
వేగుపోకలతోడ సాగు వేప రవాల
మునులు వంది జనాల ననుకరింప
శృతిపేయముగ వీణ జతచేచి గుమిగూడి
పక్షులు తనకీర్తి పాడుచుండ
బుగ్గలకంటిన పుప్పొడి దులుపుచు
భ్రమరాలు యిలుజేర పరుగులెత్త

పగలు వెలుగునిచ్చి జగమేలుపరమాత్మ
వేయి కరములున్న న్యాయమూర్తి
తూర్పుతెరను సుంత తొలగించి శుభమెంచి
కదలె ఆకసమున కర్మసాక్షి

ఇచ్చిపంప సాగి వచ్చుచు నుండగా
నడుమ దారసిల్లె పిడుగువోలె
తపసియొకడు రౌద్రతను పండ్లునూరుచు
ఆగుమింక అడుగు సాగకనుచు.

రాజకులాధమా మరచి రాజసమూర్తుల దివ్యకీర్తి వి
భ్రాజుల శైవభక్తులను భార్గవరాముల మమ్ము ప్రాతదై
యోజదొరంగు విల్లొకటి యొంచితి త్రుంచితినంచు నెంచితే
నీ జవసత్వముల్ తెలియనీయది అగ్నిపరీక్ష నిల్వరా.

చివికిన విల్లది త్రుంచితి
అవివేకీ! హరునివిల్లు అనుకొంటివొకో
పవికన్న భయదమగు వై
ష్ణవకార్ముక మెక్కుపెట్టినఁ బసతెలియున్.

గురుడగు మృత్యుంజయునకు
పరిభవమొనరించి బ్రతికి బయటఁ బడెదే
పరమకిరాతా! శిష్యుని
మరచితివే! పరశురాము మార్గణ భీమున్.

బాపలు క్షత్రియోత్తముల పాలిటి దేవత లెంచిచూడగా
తేపలు సంస్కృతిన్ ముంచక తీసెడు వారిని తేల్చగానవే
మీపయి భక్తిప్రేమ మదిమించెను నించెనుతృప్తి చాలు మీ
కోపము అగ్రహాగ్రహము కొంచెముచేయదె సంచితంబులన్.

కావున శాంతింపుము ఓ
దేవర దయతేల్చి యనిన తీక్ష్ణేక్షణుడై
తావురిమి పరశురాముని
యావిధి కనుగప్పిపోవ నెంచితెయిపటన్.

అలతిపద్మ్వాక్రమ్మ జిలిబిలిమోముపై
రాముడపుడు పరశురాము చేతి
కార్ముకంబువడిసి కరమున పట్టిన
విరిగె వానిబలము విరిగినట్లు.

జవమును సత్వముఁ కలుగు శాంతము సొంతముకాగ భా
ర్గవప్రవరుడు విన్నవోయి రఘురామ కనుంగొనినాడ విష్ణువే
ప్రవిమలబాధ జిష్ణునకు బాపగ బుట్టుట నాదుబుద్ధికిన్
దవిలె కృతార్థతంగనితి ధాశరథీ కరుణాపయోనిధీ.

కనుగొన రామబాణము అఖండమునై వృథగాదు దేనిపై
చనపలెనన్న స్వర్గముకు సల్పితి మెట్లను దానిగూల్పుమో
యనఘ యటన్న రాఘవుడు యాగతిచేసెను భార్గవుండు తా
వనులకు కూడుకొన్న యఘవర్గము సర్గము సేయజేరెడున్.

చనిబంధులతో నింటికి
దినములు దొర్లించుచుండె డివిసుఖమెల్లన్
పనిగొని యీవిధి భూమికి
కొనివచ్చెను రాముడనుచు కోవిదులెన్నన్.

మెత్తనిఆకు జొంపముల మీదఘటించిన పూలగుత్తులన్
అత్తరులుంచి పైన మధురామృతమొంచి వసంతరాజుతో
పొత్తునుగల్పి యామనినిపోషిత భర్తృకతన్ ధరించి ఆ
యత్తమునొచుసిల్చె ప్రియునంగజు పూవుల పూజసేయగన్.

వెన్నెల రాతృలందు అరవిందసమాన ప్రఫుల్లనేత్రయౌ
క్రొన్నన బోణిగూడుకొని కోమల శ్యామల సుందరాంగు డ
భ్యున్నతి గామియై తృటిగబుచ్చెను కాలమనుంగుభార్యతో
నున్నదినాలు కోటులయియున్న క్షణాలుగ తీరిపోయెడున్,

పూవులతోటలో మధురపుంజ లతాంత విలాసడోలలో
తావులుజిందు హేమమయ తల్పములో శయనించి కాలమున్
త్రోవగనెంచు దంపతులతో తమపొత్తునుగల్ప నెంచుచున్
కోవెలలార్చె నెమ్ము లనుకూలత నాట్యముతీర్చె యామనిన్.

కమలాసనుడు హంసగానక సరసను
పూబోణి బుగ్గలు బుణుకుచుండె
యింటి యిల్లాలిని రెంటిని గానక
కమలాల విష్ణుండు కౌగలించె

ఎక్కి నందిని నలుదిక్కుల నెమకుచు
వెండికొండను దౌడు వెడలె శివుడు
వాణి నారదమౌని గానక చెంగటి
హంసను చేతితో నదిమిపట్టె

నల్లనైన చక్రి తెల్లగానుంటచే
సరసజేర లక్ష్మి సంశయించె
గళము తెల్లనైన కైలాస పతిజూచి
ఉమయు జంకె జ్యోత్స్నలూరువేళ.

తలపును తలయును పండిన
జలజాప్త కులుండు ప్రజకు జాతికి హితముఁ
తలచిన క్ష్మాపతి గురుముని
తిలకుని రావించి తేటదేరిన మదితోన్.

కులగురువర్య! చాల ననుకూలత వేలు వసంతకాలముల్
తలపయి రాజ్యభారమును తాల్చితి తేల్చితితృప్తి దేవతా
వళులకు యజ్ఞయాగములు వందితమౌ తమ ధర్మదీక్ష చే
ఫలములభించె పుత్ర ముఖపార్వణ చంద్ర సుదర్శనంబునన్.

జ్యేష్ఠుడు విజ్ఞానంబున
శ్రేష్ఠుడు గుణరాశియైన శ్రీరాము శుభా
భిషిక్తు గావించుటకు వ
శిష్ఠా ! శుభమూర్తమొండు స్థిరపరచగదే.

ఆనతుడై వశిష్ఠుడపు డారసి యీనిశిచాటు రేపటన్
మానవనాథ! వుచ్చగ్రహ మందనమౌ సుముహూర్త మున్నదే
గాన క్షణంబులోన మొనగాండ్రను మీ పనివాండ్రఁబిల్చి రా
జ్యానికి చాటుబంపుడు ప్రజల్ జయమంచు ముదంబుచెందగన్.

ఆనతినంది శిల్పులును నందెలు వేసినవారు వీథులన్
మానికముల్ ఘటించి పురమంతయు పూవులనించి ముత్యముల్
పూనిచి కంబళుల్ పరచి పుత్తడిక్రొత్తడియూపపట్టి కం
బానికి వన్నెబెట్టి ధ్వజపట్టముగట్టిరి తోరణంబులన్.

రాముడు రాజుగాగలడురా మనభాగ్యమునిండి పండెగా
దా మురియుంచు భూమిప్రజ తన్పుటెపండలతోడ నేటికా
గాములు తీరు సౌఖ్యముల ఖండముచేరు ముదంబుమీరు సం
చేమొతలంచి ద్వార ముఖసీమకుగట్టిరి తోరణంబులన్.

జగమునకెల్ల పండుగగుసంగతి మంథర గూనిదొక్కతే
పగగనునెంచె భంగమగు బాటలుకాంచె మనంబునించె నీ
తగని పనింఘటించుటకు తానయి పూనెను కైకకేవిమో
తగవులుచెప్పి ఆమెమతితత్వము త్రిప్పెనుముప్పుగప్పగన్.

తిమ్మిని బమ్మిని జేసెడు
యిమ్మెలుగలప్రోడ జగము నెంతయొ విషా
క్తమ్ముగ చేయగదలచెను
యిమ్మాదిరిగలదె యెచటనేనియు తలపన్.

చక్రవర్తితలచె, శాసించె గురుడు సా
మంతప్రభులు సర్వ మంత్రివరులు
నిర్ణయించిరద్ది నిలిపె దాసియొకర్తు
యింతకన్న ఘోరమేమి కలదు.

ముద్దులభార్యను కైకను
పెద్దగ యా ముసలిరాజు ప్రేమించును ఆ
ముద్దియ కను లెరుపెక్కిన
అద్దొరబ్రతు కాకువోలె అల్లల్లాడున్.

మునుపెపుడో యొసంగెనట ముద్దులభార్యకు కైకకెవ్వియో
జనపతి రెండు కోర్కెలవి స్వామిని కోరెను గూనిమంధ రే
మని యహితంబులన్ నుడివి మార్చెనొ మానస మామెప్రేమతో
గనుగొనురాము తప్పి యపకారము చేసెను మాళకూరుముల్.

రాము సంతతాభిరాము కోమలశ్యాము
చక్రవర్తిచేయ చర్చ సలుప
కైకకోరె ఘోర కానన సీమకు
పదియునాలుగేండ్లు పంపునట్లు.

భరతు రాజుజేసి పంపురాముని ఘోర
వనులకన్న మాట వినిన మాత్ర
గుండె వ్రీలి రేడు కూలెను భూమిపై
ప్రాణపంచకంబు బాసినట్లు.

కన్నుల చందమామ తనుగాంచిన పెన్నిధి జీవగఱ్ఱయౌ
చిన్నినిసింగు కానలకుజేరును రాముడటన్న వార్తయే
భిన్నమొనర్ప గుండియెలు బిట్టుగశోకములోన మున్గి రే
డున్నవిధాన నేలపయి యుస్సురుమంచని కూలెఖిన్నుడై.

చంద్రుడేగునెడల చంద్రిక యుండునే
కొడుకుకీడు తండ్రి కోరుకొనునె
కన్నకొడుకును పితృకర్మ సేయగడగు
రాముడేగ పంక్తిరథుడు మనునె.

కోపము రూపుగైకొనిన క్రోల్పులియోయన యెర్పుడాలు సం
తాపముజూప కన్నులను తైక్ష్ణ్యముదోప కులంబుమాప యే
రీపనిచేసిరా ఖలశరీరుల శీర్షము తీయనెంచుటే
నాపనిమంచు లక్ష్మణుడొనర్చెను భీకర ఘోరరావమున్.

మాతయు తండ్రియు ననిమది
చేతులు జోడించి సేవజేతురె మీ రా
పాతకి శాతకరాశినీ
ఘాతంబున కైకశిరము ఖండనచేతున్.

అని పరవళ్ళుత్రొక్కు చపలాత్ముని లక్ష్మణుజూచి శాంతుడౌ
మనుజవిభుండు రాఘవుడు మన్ననసేయక పెద్దవారలన్
ఘనమగునే యిటుల్ పలికినఁ క్షమియింపగ తండ్రికాళులఁ
గొని తగకండ్లకద్దుకొని కోయుము పాపములన్న దీనుడై.

జనకుపాదములకు సాగిలిమ్రొక్కెను
తలను బుణికి రాజునిలిపె ఎదను
తనయుతప్పు తండ్రి మనమున నెంచునే
మధుర సుధనుచిలికి మనుచుకాని.

కానకకన్న అసుతుల కాననసీమకుబంపి ప్రాణముల్
తానెటు నిల్పు రాజు సుతతాపము మోపయి కన్నుదమ్ములన్
వానలు జార్చె ప్రాణముల వంతనుగూర్చె పరంబుజేర్చె ని
ట్లైనది వృద్ధరాజు బ్రతుకంతయు కైకవరంబు కీడునన్.

తడబడు నడుగుల విడిబడు ప్రేయసి
బాహుబంధమువీడి బయట బడగ
త్రావిమత్తిలు కండ్లగావిరి గ్రమ్మగా
ధవులకు ముద్దులు తరుణులిడగ
పుట్టేమి మునిగెనో పోయెనింటికి అడ్డె
అనుచును గుసగుస లాడుకొనగ
చెక్కిటి తమ్ములు రక్కిన గుర్తులు
క్షాళించ విభుడిట్టె మేలుకొనగ

కొలువు తెల్లవార్లు వెలిగించి సరదార్లు
తారలొక్కటొకటె జారుకొనగ
వెల్లమోముతోడ నిల్లాలిజూడగా
చందమామ మింట జారుకొనియె

తమ్ముడు సీతయు వనులకు
సమ్మతిరా ప్రజలు బాష్ప చయములతోడన్
చుమ్మలుగొన రఘురాముడు
అమ్మల మది కలయచేసి యడవులకరిగెన్.

జానపదుల దుఃఖజలధి వీచులద్రోసి
తల్లితండ్రి మంత్రి తండములను
బాధపెట్టి రామపరమాత్మ వనులకు
కదలిపోయె కర్మకారణమున.

మునివేషములను గైకొని
చని సరయూనదినిదాటు సన్నాహముతో
గనుచుండ నోడ నచటికి
గొనివచ్చె నిషాదుడొకడు కుతుకాత్ముండై.

ఎవరాతాపసి వెంటకాంతగలదా యెందైన నిట్లున్నదా
కవలాయిద్దరు రామలక్ష్మణులటే కన్నమ్మ సీతమ్మయే
యవునా ఏమిటిపోక కానలకె యౌరాభాగ్యహీనుల్ గదా
భువినీ ప్రాణులు రామచంద్రు పదముల్ పూజింపలేకుంటచే.

ఎవరు నిషాదుడా గుహుడదేమిటి ఆత్రముతోడపోయి రా
ఘవులను గాంచి మోడ్పుకయిగా అనుచున్నదదేమి ముచ్చటా
ప్రవరునకల్పుతో పలుకవచ్చునె రాజకులాలు కన్నచో
దవులనుపోరె ఏమిపని తప్పని యొప్పనిగూడ నెంచడే.

తేనెలు తొణకగ నమృతపు
సోనలు చిందంగ శ్యామ సుందరుతోడఁ
తానేమొ పల్కుచుండెను
గాన వినందగును గుహుని కలభాషణముల్.

తాళయ సామినీపదము తాకన రాయి క్షణంబులోపలఁ
బాలిక యయ్యెనంటె యెడబాటగు కూటికి ఓడలన్నియుఁ
స్త్రీలగునేని కాన యతసీసుమ కోమల పాదపద్మముల్
క్షాళన సేయనిమ్ము మది క్షాంతిని క్రాంతిని శాంతిజేయగన్.

పొంగులువారు భక్తితలపోసిన అత్యనురక్తి దోయిటన్
గంగనుబట్టి యాగుహుడు కర్మలునెట్టి పదాలుముట్టి నా
కుంగయిసేయు ముక్తియను కోమల రత్నచయంబులంచు నా
మంగళమూర్తి కాళులు నిమజ్జనచేసె భవంబదెట్టిదో.

పంచవటిఁ నివసించియు
సంచితములు బాపుకొనుచు సౌభ్రాత్రత సే
వించగ లక్ష్మణ సీతలు
అంచితగతి రాముడుండె యానందమునన్.

పుల్లని వీయవి తియ్యని
ఫల్లవియని లక్ష్మణుండు వర్ణింపంగా
సల్లాపము నొనరించుచు
మెల్లగ దిగమ్రింగితేమి మిగిలించితయా.

సౌమిత్రి లోనిచవులను
తామూర్కొని తెలయు శేషుతత్త్వముగానన్
స్వామీ మరచితిరయ్యది
మీమీదను భక్తిగాగ మీరెరుగరుగా.

తేనియ వూటకాలువల తిన్నెల పొన్నల క్రొన్నెలందు నీ
మానిని సీతగూడుకొని మాటితివోయి అరణ్యవాసమో
మానవనాథ లక్ష్మణుడు మౌనిగభార్యను యింటడించి నీ
ప్రాణము వానిసొమ్మనుచు పాపము కాపలి కాయలేదొకో.

భరతుడు తాతగారి ఖులుబాసియు తమ్ముడుగొల్వ కోసలకా
సరగునజేరి రాముని గనకాజనె అతడు కైకఆజ్ఞచే
పురమునువీడి కానలకు బోయెనటంచని విన్నయంత దు
ర్భరమగు నాగ్రహోగ్నులను రాల్చుచు అంతిపురంబు చేరిసన్.

నాయన నీయభివృద్ధి యు
పాయము లన్నియును నెమకి ప్రభువుగ నిను నే
నే యొనరించితి యికపయి
హాయిగ జగమేలు ప్రజలు హాయని మెచ్చన్.

కనుల కవోష్ణబాష్పములుగార యిదేమిటి రాక్షసాంగనా
జనమటు రామచంద్రు ఘనశాంత దయారససాంద్రు హో రకా
ననముల కంపి రాజ్యరమ నాకిడుమంచని కోరినానె? మా
రణ మొనరించనావుగదె రాక్షసి! చల్లని రామరాజ్యమున్.

పాతకము యెన్నిజన్మల
చేతసయిన బాసి చనునె శ్రీరాము దయా
న్వీతుని ప్రజాభి వత్సలు
నీతిదొరగి వనికినంపు నీచకునీకున్.

వనులకునేగి రాఘవుని వత్సల పూర్ణుని దోడిదెచ్చి జీ
వన నవభావముల్ సలుపువాడను జానపదాభివృద్ధి సా
ధనమిది నీతిదప్పిన కృతఘ్నుడు రాజగునే వచించునే
ఘనుడని వాని యాకథలు గాంచునె గవ్యాపథానుగుణ్యామై.

తమ్ముడు వచ్చువార్తవిని తామసియౌ మన లక్ష్మణుండు సీ
తమ్మను గొంచు కానలనుదాగిన రేగిన రాజ్యకాంక్ష చి
త్తమ్మునుగ్రమ్మ తల్లిమది దన్పగ వచ్చెను వీనిద్రుంచి మో
దమ్మును గూర్తు పంపుడనె తానెరుగం డతడేలవచ్చెనో.

శాంతిబోధలపుడు సలిపి లక్ష్మణునకు
రామచంద్రుడధిక రత్నగుణుడు
భరతు కౌగలించి బాష్పాలు కన్నుల
గ్రమ్మ తలనుబుణికి నెమ్మదిననె.

తమ్ముడ సేమమే ప్రజకు తండ్రికి మాతలకెల్ల చాల శాం
తమ్మెకొ రాష్ట్రవృద్ధికిని దారులు గూర్చితివే వశిష్ఠు దై
వమ్ముగ పూజలన్ సలిపి వారిమనంబును చూరగొందువే
సమ్మదమే భటప్రజము సత్వరమే యెరిగింపు మెల్లయున్.

అని తమ్ముడు వచియించెను
కనులను కన్నీరుచింద గద్గదికమెయిఁ
గొనకుత్తుక మన జనకుడు
చనె స్వర్గము నిన్నువిడచి క్షణముండమిచేన్.

వలపును గ్రుమ్మరించు తనవాంఛను కన్నులలోని తేనెలఁ
గలిపిధవుండు రానెదురు కాంక్షను గుమ్మములోన నాత్రయై
నిలిచెను పద్మినీరమణి నింగిని యెఱ్ఱనిచుమ్ము జిమ్ముచుఁ
జలజహితుండు తానురకమూగెను సాగెడు ప్రేమనింటికిన్.

తమ్ములు మూవురొక్కపరి తర్పణమిచ్చిరి తండ్రి స్వర్గధా
మమ్మున నుండి కన్గొని సుమంబులు రాలిచె తృప్తికన్న మా
ర్గమ్మున చెట్లుపూవులను రాల్చగ తేనియ చారపప్పుతో
చుమ్ములువారు సోకమును చూచి మృగంబులు నీరునించగన్.

జానకి మామగారికయి చాలతపించెను నిన్ను సేవలఁ
మానుగతన్పి ఆశిషముమాట యటుంచుడు, తృప్తియేనియుం
గానము కానసస్థలులు కాలము బుచ్చెడు మేము నీకు పు
ణ్యానికినై తిలాంజలు లొనర్చుటతప్ప మరేమియేనియున్.

మామా యెడదలు అమెత
మామా పసివారుసేయు మధుసేవనయే
మీమానస సంతృప్తిగ
మేమనుకొని తృప్తిజెంద మిముప్రార్థింతున్.

సోదర నీదయామృతము సోకక నాకపకీ ర్తిపోదు మీ
మీదనె ప్రాణముల్ నిలిపి మిమ్ములగొంచును బోవనెంచియే
గాదె వనాలకున్ యిటులకాతరతన్ చనుదెంచుటింక పై
ఆదకయున్న భూప్రజలఖండ దురంత వ్యథాత్మ కుందరే?

అని భరతుడడుగ రాఘువ
జనవల్లభుడనియె పితరు శాసనమునకై
వనములకును వచ్చితి దా
నిని మానిన నన్ను జనులు నిందింపరొకో?

చనెదను నందిగ్రామముకు సల్పుదుదీక్షను మీదుపాదుకల్
గొనియెద నిల్పుకొన్చు మిమ్ముగొల్చెద తేల్చెద మానవావళిన్
అని భరతుండు కన్నులను అద్ది గ్రహించుచు అన్నయీగ వే
చనె వెనుజూచివెళ్ళుటకు చాలక యేలిక అజ్ఞ భీతిచే.

తామసివీవు శాంతుడను తాపసిసంఘము నోరులేని బా
ధామయ జీవి కాకి సతిదాకినదంచును కన్ను దీతువా?
స్వామియిదేమిరీతి? నరజాతికి నీతినుపన్యసించు మీ
కోమలమౌ చరిత్రనిది కొంచెము సేయుసటంచు నెంచవా?

చని చిత్రకూటనగమున
అనుగుంజెలితమ్ము గుట్ట అండనునిలువన్
దినములు దొర్లించుచు రా
వనమున చరియించి రసురవర్యులు ప్రబలుల్.

ఖరుడును దూషణు డనియెడు
నరభోజను లేగుదెంచి నాశము సేయన్
పరమాశుగముల చేతను
బరిమార్చిరి దాశరథులు భండనవీరుల్.

రావణసోదరి శూర్పణ
ఖా వనరుహనేత్రి ఖరుల ఖండన వినుచుఁ
గావిరిగ్రమ్మిన కన్నుల
తో వారిని జంపవచ్చి తోచి యడవిలో.

నల్లని కలువలకన్నను
పుల్లాబ్జాతములకన్న పూర్ణేందు కళా
వల్లరుల నీను రఘుకుల
తల్లజుగని కామబాణ తత్పరమతియై.

చూపులు పూలు దేహరుచిచూచిన పుత్తడిబోలు పల్కులా
ప్రాపిత తేనెచాలువలె భాసిలుచక్కని లేమయౌచు భూ
మీపతి రాముగాంచి నునుమించుల చూపులునించి సామి నీ
వే పతివై వరింపగదవేనను బాలను పూలకోలనున్.

అని తేనెచినుకులనువలె
ననుచును తనుజేర రాముడానతి యిచ్చెన్
చను " లక్ష్మణుడందంబున
ననుమించును వాని గొనుము"నఁ చనివేగన్.

రతియో భారతియో భూ
సతియోయన రూపుదాల్చి సౌమిత్రి కళా
చతురునిగని మృదుభాషల
మతిదెలుపగ సరస నిలచి మధుదృక్కులతో.

కనుగొని రామచంద్రు నిజకల్పన దెల్పిన నవ్వి లక్ష్మణుం
డను నిటువంటిదానవికటా అకటా! వికటంబులాడెదే?
చనుమిదె నీదు చుట్టలకు సొంతముదెల్పు మటంచు క త్తిచే
గొనుచును ముక్కునున్ చెవియు గోసెను కూయిడి ఆమెయార్వగన్.

చిక్కని జవ్వనంబు తమచేతికినీయ నెడంద కూరుముల్
గ్రక్కగ నేగుదెంచు నొకకాంతను ముక్కునుగోయబంపు నో
టక్కరి! రాజధర్మమె? కటా! యిది, తానయి కోర్కెపేయసిన్
చిక్కులువెట్టి నీతలకుజేర్చితె యేకసతీత్వధర్మమున్.

అన్నను రావణు గనుగొని
ఉన్నవి లేనివియు చెవినయూది యటవిలో
నున్న రఘురాము పాలికి
అన్నిచుని బంపెనేమి యాలోచనయో.

కనకముమేను, కన్నులనగామరివెన్నెల లీను, చేతులా
కనుగొనతూండ్లు చక్కనగుకాంచనపుష్పముమోము జానకిన్
గొని మనలంకనున్ నిలుపు కోరికదీర రసస్రవంతిలో
మునకలు వేయగాతలపుపుట్టిన మేటిజగన్నియంతవై.

శూర్పణఖ పల్కులను మదిజొన్పి ప్రభుడు
దెబ్బదిన్న మారీచుడు దెలిపియున్న
రాముశక్తిని యెరుగక భామ దేగ
పసిడిమృగముగ దానవుబంపి కదలె.

ముంగిటదాగు కన్మొరగు ముచ్చటగొల్పును చేతికంద కే
చెంగునదూకు పూపొదల చెంతలజేరును సీతజేరగా
నింగికిబారు మిట్టలకునెక్కును నిక్కును యేమిమాయమో
బంగరులేడి జానకిని భ్రాంతనుజేసెను వింతరూపునన్.

పుత్తడిలేడిపై మనసు పోయెను హాయిగ ప్రొద్దుదానితో
బుత్తును తెచ్చియిమ్మనుచు భూసుతగోరగ రాముడేగె నా
బిత్తరిలేడివెంట వెరపించెడు కార్ముకమందు బాణ మా
యత్తముచేసి మోదుటకు నాదుటకీతడు నేతయంచనన్.

చెంగట దోచును గంతుల
నింగిని దొరయంగ బారునిటుగనుపించున్
ముంగల నిలుచుచు ఉరుకుచు
బంగరుమృగ మాటలాడె పరమేశ్వరుతో.

విసిగి రాఘవుండు వీర కిశోరుండు
కార్ముకానదొడిగి గాఢజవము
బలము కలిగియున్న బాణంబు వేయగ
పసిడిమృగము ప్రాణపటలి విడచె.

చచ్చెడుమృగ " మో జానకి
చచ్చితి లక్ష్మణ ! " యటంచు సర్వనగంబుల్
వ్రిచ్చగ నరువగ భూసుత
అచ్చరుపడి నిటులనాడె నలమినభీతిన్.

ఏమిది లక్ష్మణా ! ప్రభునకేమి ఘటిల్లెను ? ప్రాణభీతియే
స్వామికి వెళ్ళవేమి ? పటుసాయకవర్షమునించి అగ్రజున్
నోమగ పర్వులెత్తుటకు నూల్కొనవేమి ? జడత్వమేటికో
నీమదినించె నామనసు నీరొనరించె త్వరన్ జనన్గదే !

అననసీమ చిర్నగవులాడగ జాగృతికూడ బేలవై
మానిని మాటలాడకుము మామకసోదరు రామచంద్రు యు
ద్ధాన నెదిర్చి పోరగల దంటలు గల్గుదురే ధరాస్థలిన్
దానవమాయ నమ్మదగదమ్మ యదార్థమటంచు జెప్పినన్.

కాలము కర్మమున్ గలసి కాంతకు చిత్తమునార్చి యేమియో
ప్రేలగజేసె " అన్న యిటు ప్రేతపురిన్ గన వానిభార్యనున్
ఏలగ చిత్తమందునను నెంచిన పాతకివేమొ ! లేనిచో
కాల విలంబనంబిటులగా నొనరింతువె, రోతనింతువే ! "

అన చెక్కులు బాష్పంబులు
దొనుకగ గాద్గదికదోచ దూషణకెంతో
మనమున భయపడి జానకి
ఘనతరమగు నాజ్ఞజేసి కదలె రయమునన్.

ద్వారసీమయందు ధవు రాక కోసము
మరది కొరకు లోకమాత నిలువ
తపసివేషమూని దశకంఠు డేతెంచె
వానగోర పిడుగు వడినయట్లు.

భామగాదిది చందమామ తోబుట్టిన
లావణ్యసీమయౌ లచ్చిగాని
లచ్చిగాదిది కళాలలిత సౌందర్యతా
భరితమౌ క్రొక్కారు మెఱపుగాని
మెఱపుగాదిది సుధాసరసి నుద్భవమైన
ధాళధళ్యముగల తమ్మిగాని
తమ్మిగాదిది జగాతారుణ్య సౌజన్య
ముగ్ధమోహనమైన మూర్తిగాని

మూర్తిగాదిది ముత్యాలమొనల సిలిపి
శిల్పి మలచిన రత్న నిశ్రేణిగాని
శ్రేణిగాదిది చెలువుకు స్థానమైన
కంతుడాచేతిపూవుల బంతిగాని.

భిక్షగోరితన్ను బిలచినఅతిథిని
అర్చ సేయనెంచి అవనిజాత
వచ్చిచూడ దైత్యవల్లభుడగుపించ
పూలతీగవోలె నేలగూలె.

మూర్ఛ పోవునట్టి ముగ్ధను సాధత
గంగిపుపువంటి కన్నతల్లి
పొదివి రావణుండు రథమున గొనిపోయె
లంకవంక భూతరాజివణక.

చిత్ర విచిత్రములకు కథు
పాత్రముగద చిత్రకూట పర్వతమచటఁ
చిత్రములకు తక్కువయే
మిత్రులు శత్రువులు శ్రుతులు మిక్కిలి కటువుల్.

క్రొన్ననవంటి అందమగు కోమలి రక్కసియాట పైడిమే
నున్న మృగంబు ప్రాణముల నూడ్చెడు రాక్షసమూర్తి గొంట సా
ధ్వన్నను రావణాసురుడు దండనవుంటయు చిత్రకూట మం
చన్నది యిన్నివైఖరుల సార్థకమయ్యెను వింతరూపులన్.

క్రొన్ననవంటి మేనిపయి క్రొత్తడిసల్లని కోకగట్టి తా
పెన్నెరులందు నైలిమను పెంచెడునల్లని కల్వజుట్టి మే
లన్నవి యింద్రనీలములు లక్షలునించిన సొమ్ము పెట్టి కూ
ర్చున్నది యీతమప్రియవరూధిని ఆకసపీఠి గోటుగా.

తమ్మునితోడ రాము డతిదారుణమైన వియోగభార మం
గమ్ముసగ్రమ్మ చెట్టులను క్రంతల పొంతల సీతకోసమై
చుమ్మలువారనేడ్చె నెటుజూచిన తోచని మానసంబునన్
సొమ్మసిలంగ నుస్సురని చూచి నభశ్చరులట్టె అర్వగన్.

కొండలు చెట్లు పక్షులును గుండెలులేని అచేతనంబులై
యుండియు రాముకష్టమున కూర్పులు పుచ్చెను మానవత్వముల్
నిండుకొనంగ దానవత నిల్చిన రక్కసు పేరెడందలో
పండదుపో, దయామృతపు పక్వఫలంబొకటైన స్వాదువై.

జానకి పేరెలుంగువిని జాతికెపక్షియె యైననేమి యు
ద్ధానికివచ్చి రౌద్రమునదాకి శరీరము రక్తసిక్తమై
ప్రాణములన్ను బట్టినను పాపిదశాస్యుని ఘోరహేతికిన్
పూనికనిల్చె నాపతగ పుంగవుడైన జటాయువృద్ధతిన్.

సఖుని యెదుట పొగడి సందైనమిత్రుని
మొగముచాటు తెగడు జగమునట్లు
కాక మిత్రుకొరకు కాయంబు బలియిచ్చె
నా జటాయువెంత సనఘమతియొ.

నరులును ఋషులును మృగములు
పరికించుచు ఒడలుదాచ పరహితమునకై
యురుకుచు అశువులనిచ్చెను
కరుణ మనుష్యులకు నేమికాణాచియొకో.

విశ్వజేత అచ్చవీరుడు బలశాలి
రాక్షసేశ్వరుండు రావణుండు
అనుచు జంకులేక అహవానికిదూకె
పక్షిరాజు మిత్రభక్తి వలన.

ముద్దును ముచ్చటదీరుచు
పెద్దలు శుభమూర్తులట్టి పితృదేవతకే
రద్దగు రఘురామునిదగు
సద్దయ ప్రవహించె పతగ సామ్రాట్టుపయిన్.

సాత్వికుండు సత్య సన్మార్గనిరతుండు
శాంతిగామి సుగుణశాలియైన
పతగనేత ముక్తి పదవిని జేరెను
జన్మ కర్మ బంధ సమితితూల్చి.

---

# రామరాజ్యము

## మలిపాలు

తుంపరజల్లులు దరులను
నింపుచు వృక్షముల దడిపి నిగ్గును సొగసున్
యింపును నొనగూర్చెడునవి
పంపా సరసీవరంబు భాసిలునటవిన్.

కన్నుల మోదబాష్పములుగార పొరింబొరి మేన పుల్క లు
త్పన్నముగాగ గాద్గదిక దార్కొన కంఠమునందు, యేమి నే
విన్నది, రామచంద్రప్రభువే కరుణింపగ వచ్చుచుండెనే!
మన్నది సార్థకంబయెను, మామునిపల్లె తరించెనేటికిన్.

జాతివిహీన యీశబరి జానకివల్లభస్వామి వెత్తిగా
జూతువెనన్ను స్వార్థప్రజ జూచెడుకంటను నీదుసేవకై
నా తనువెల్ల మీదిడితి నాపతి నాగతినీవె రిత్తగా
జేతువయేని యేమిగతి చేడ్పడి కీడ్పడి నాశమందనే.

ఈవరుదెంచ స్వాగతము నీయగ మావిచిగుళ్ళ తోరణాల్
పూవులు ద్వారబంధమున పూన్చి మరందము దొప్పలోన నా
దేవరకై నివేదమిడ తెచ్చితి, మెచ్చితిరేని ధన్యనై
పోవనె సాటిలేని తలపుల్ వలపుల్ ననుచుట్టుముట్టగన్.

వగరులొ చేదులో పులుపొ పండ్లరుచిన్ గ్రహియింపనేరకో
జగతిపితా యొసంగుటకు చాలక వానినినాదు పండ్లతో
పగులగజేసి లోనగల పాకము మీకు నెరుంగజేయగా
దగునని యెంగిలించితిని తప్పగునేని క్షమింపవా ప్రభూ!

ఎంగిలి నిచ్చి నాకులమునెల్లను కల్మషముం బొనర్చె, నీ
వెంగలియంచు నాగ్రహము వేమరు పూనకు రామచంద్ర యీ
భంగులెరుంగవే పరమపావన? తేఋలుత్రావుతేనె నా
సంగను నుత్సహించుమన నాగరులా యిది యేవగించుటల్.

భిల్ల కులీనజ్ఞానమను పేరునెరుంగనికాంత భక్తినీ
పల్లవ కోమలంబయిన పాదములంటి మరందధుర్యమౌ
పుల్లనగాని పండ్లనిడి పుక్కిటబట్టిన తేనెవెట్ట రా
గిల్లితి వామెయెంగిలికి కీరితి ఆరతిబట్టి రాఘవా!

ఎన్నడు పండ్లే యెరుగవొ
కన్నావో, లేదొ తేనెకరవయ్యెనొకో!
అన్నా! ద్రాక్షలు అవిరి
గొన్నట్టుల యెంగిలెల్లగొని మెసవుటకున్.

కమ్మనిచారపప్పు వడగట్టినతేనియ నిగ్గుదేరి అం
దమ్ముగ పండుద్రాక్ష తినదగ్గ ననంటులు రామచంద్రుడు ప
దమ్ముల చెంతబెట్టితివి ధన్యవు భిల్లపురంధ్రి! నీదు భా
గ్యమ్ము సువర్ణవర్ణముల నక్షరమై జగతిన్ వెలుంగుతన్.

దివ్యఋషులకైన తెలియని దైవంబు
ఉపనిషత్తులందు నుండువేల్పు
అఖిల సాధనలకు నందనిరాముండు
భిల్లశబరియింట భిక్షగుడిచె

సకల బంధువరుల జంజాటమాలేదు
సుతులులేరు ఆత్మపతియులేడు
యేమిభాగ్యఫలమొ సామాన్యబోయెత
రాముచేత జన్మరహితయయ్యె.

వాలివిరోధివర్గముల వంతలగూర్చు పరాక్రమోర్మి కా
మాలి అనంతసత్వ ఘనమాన జగద్ధిత శీలి ఆహవో
త్తాలి సహోదరుందరిమె దారుణమౌ విపినాల కద్దియే
చాలదె, వానిరాజ్యరమ సర్వసుఖువాపి కొలంబునారుపన్.

చని ఋష్యమూకనగమున
తనమంత్రులు హితులుకొలువ తానిలిచె మహా
ఘనసత్త్వుడు సుగ్రీవుడు
హనుమంతునిబంపె రామునరయుటకొరకై.

పావని రామచంద్రప్రభు పజ్జకుజేరియు కీశభర్తకుజ
జీవనదానమున్ తమరు చేయుడటంచును చెల్మిగూర్చి సు
గ్రీవుని మన్చె సత్ప్రభుని క్రిందటిమంత్రులుకారె; కీర్తిసం
భావులు అనన్యశక్తి ప్రతిభా విభవా చరితార్ధవర్తనుల్.

అనతమూర్తి కీశవిభుడట్లువచింపగ రామచంద్ర భూ
జాని సుదీర్ఘ యోచనముసల్పి ధరాజమువెన్కపొంచి యు
ద్ధానికిరాక తన్నెదురుదల్పక తమ్మునినేచు వాలి ప్రా
ణానికి ముప్పుదెచ్చె తననమ్మిక పమ్మయి భీతిసెంచగన్.

వాలియనియె దీనుపోలిక సుగ్రీవు
దండజేరి నీతిదప్పితేమి
రామచంద్ర వైరిరావణుదెమ్మన్న
నొక్క క్షణములోన నొసగలేనె.

వారిధియందు రావణుని వారకపుంచిన శౌర్య ధీర వి
స్తారుని కీశవల్లభుని సాత్వికుజంపుట రాజధర్మమా ?
శూరతయొక్కొ రామ పరిశుద్ధమనస్కుల చేతలిట్టివా ?
క్రూరతగాదె పందవయి కొట్టుటవైరిని డాగి మాటునన్.

అనఘు సహోదరు మాటలు
వినుచు నిజానిజము లవ్వివివరణగాగన్
గనకపకృతి సేసితివా
నిను ఆ ఘోరాఘచయమె నిర్మూలించున్.

నీళులుద్రావి పర్ణములనే భుజియింపుచు శాంతిపాఠముల్
చాలనుపన్యసించు నరజాతికి నీతినిజెప్ప కీశులన్
గూలుతువేమిరీతి నృపకుంజర ఘోరపనాలనున్న మా
జోలికిటేల వచ్చితి ప్రజోపకృతుల్ యిటుసేయమెత్తురే.

అన రాముడనియె వినుమో
వనచర ! సోదరుని భార్య బట్టితి రాజ్యం
బున నిల్వనీక గొట్టుట
లొనరించితి నీతులేల నూరక చెప్పన్.

ప్రజలు తప్పుశేయ ప్రభువు విచారించి
మంచిచెడ్డ లేర్పరించవలయు
చక్రవర్తి తనదు జాగృతి మరచిన
ప్రబల అఘచయాల పాలబడడె,

నన్ను వధించినావు నరనాయక తమ్మునిమీద పక్ష పా
తోన్నతిజూపి ధర్మగతి నొక్కరవంత గనంగలేక నీ
చిన్నె వచింపబూనుకొన సిగ్గగు రాగల జన్మమందునన్
నిన్నువధింతు బోయనయి నిశ్చయమీశపథమ్ము రాఘవా.

రాజ్యసుఖము భార్య రసవిహారంబును
స్వామిమాట మరపు సలుప తనకు
కపివరుండు హాయి కాలంబు దొర్లించె
విషయ పరత ఘోరవిషసమంబు.

జలజల వర్షపుంజినుకు జారగ కర్షకు పేరెడందలో
కులికెను ధాన్యలక్ష్మి తనకుణ్ పులకల్ పొడమంగ భూమియున్
పలపలబారె సస్యములు పండిన నిండిన గుండె అందముల్
చిలికెను విశ్వశాంతికిది జీవమటంచని యిచ్చమెచ్చగన్.

తమ్ముడ కీశనాధుడు కృతఘ్నత పల్కినయట్టి బీరముల్
వమ్మొనరించి రాష్ట్ర రసవల్లుల చిక్కెను నీవుపోయి ధ
ర్మమ్మును బోధజేసి కపిరాజును తోడ్కొనిరమ్మటన్న క్రో
ధమ్మున లక్ష్మణుండు శరధారిగనేగె మహారయంబునన్.

ఏరుదాటి తెప్ప గారించు విధముగ
మేలుగాంచిమమ్ము బేలుపుచ్చి
యింటగులుకుచుంటి యిల్లాలి కౌగిలి
క్రోతిగుణము యెటుల ద్రోతునిజము.

సుగ్రీవుడవానీవు ద
శగ్రీవుడె కొంతనయము స్వామిద్రోహా
తిగ్రహమూనడు వానిని
అగ్రహ విగ్రహము నాది ఆస్వాదింతే.

అనియెడు లక్ష్మణుందరసి అగ్రహమూనకు వర్షకాలమే
చనగనె యుద్ధయత్నములు సాగును వేగునుయేగు దానిసిన్
గనకయె ఏల మాపయిని కార్ముక మెత్తెదో శాంతిరూపమున్
గొనుమని రామచంద్రుడు పదకోమల సీమకునేగి నమ్రుడై.

మరచితి కార్యమగ్నతను మా గిరికంధరభూములందునన్
దొరకినదిద్ది రత్నములతో జతజేసిన భూషణాలతో
నరయుడు మూటయన్న జననాధుడు కన్గొని కండ్లబాష్పముల్
దొరుగగ సీతవే యెచటదోచెను మాసెను అమె ప్రాణముల్.

అన సుగ్రీవుడు రావణు
పనియిది లంకాపురంబు బాటిటె కానన్
మన వేగుల సింహాళముకు
చనజేతమటన్న రామచంద్ర నృపుండున్.

పావనిబిల్చి నా హృదయభారము దీపుపదగ్గ శూరతా
జీవుడవీవె ముద్రికను చేతధరించియు సీతజేర్చి యా
దేవి విధంబుదెల్పి ననుదేర్చుము తీర్చుము లోనిబాధ నా
జీవమునిల్పు వెజ్జుపని సేయుము హాయిగ పొమ్మటంచనన్.

పవన జవమూని మారుతి
భవవార్ధిని యిటులదాటు పద్ధతి యనుచున్
తవిలిన వానవులనగా
నవిరళగతి దాటె నుదధి నతిసత్వమునన్.

వారిధిదాటి లంకిణి కవారిత శాపమువాపి లంకల్లో
జేరి సువర్ణ రత్నమయ శృంగవినిర్మిత సౌధరాజిలో
నారసి, సీతగానక నహా! మనుజాసను డేమిచేసెనో
క్రూరుడటంచు తానెమకె గొప్పవనాలు నగాలుసైతమున్.

కోడెపులులమధ్య గోవున్నయట్టుల
హరుల నడుమనున్న కరి విధాన
చెన్నుదరిగియుండె చింతాసమేతయై
ధరణిజాత సీత తరువుక్రింద.

శోకముహాన్చు భూరుహము శోకము పెంచెను సీత దీనయై
వాకొనుచున్న ధర్మములు వానిఎడంద కడింది మాన్పగా
లేకయెపోయె, రాక్షసవరేణ్యుడు రావణుడేగ ముందటన్
దూకెను క్రోతి మాయయనితోచుచు సీత విచారమందగన్.

ఎవ్వడ వీవు రూప మిదియేమిటి ఎవ్వనిపంపుచేత నీ
వివ్విపినంబు చొచ్చితివి ఇచ్చటనుండక లెమ్ము నిల్వకే
దవ్వులబొమ్ము కన్గొనిన తప్పను ప్రాణములన్న నమ్రుడై
నవ్వడిసేయకన్ హనుమ సాగిలిమ్రొక్కి పఠించె సర్వమున్.

అని ముద్రిక నిడి, జానకి
తనకిచ్చిన మణిని గొంచు, తా నాజ్ఞను వే
గొని వనమునగల ఫలములు
తినె మారుతి అకలి కడు తీవ్రమెవరికిన్.

చనుచు వనంబు సొంతమును జక్కొనరించుచు వృక్షసంతతుల్
పెనచుచు కేకలన్ యిడుచు పెద్దగరద్దినొనర్ప కావలిఙ
గను భటులేగుదెంచ భుజగర్వ మఖర్వతచూపి వారినిన్
పెనుగద నూని కూల్చె మొరవెట్టుచు లంకకు పర్వువెట్టగన్.

ఉరుకులు పరుగులతోడను
అరుదెంచి దశాస్యుజూచి అనిరిట్టుల నో
దొర ! మన అశోకవనమును
నురు మొనరిచె క్రోతిగన మనోజవ జవమై.

కావలివారిఁద్రోలి భుజగర్వముగల్గిన వీరయోధులన్
జావగమోది భూజముల సాంతము అంతముజేసి అంతతో
బోవక, పండ్లిగిల్చుచుచును పోరికి కాలునుద్రవ్వుచున్న దో
దేవ! యదార్థమున్ దమకు దెల్పగవచ్చితి మా ర్తిగుందుచున్.

అనగ రావణుండు ఆశ్చర్య సరసిలో
మునిగి తేలి, యేమి వినగగలిగె
ఒక్క చిన్నకోతి యుక్కడగించెనే
వీరభటుల పెక్కు వేల నిటుల.

అక్షయకుమారు ననిపిన
రాక్షస యువరాజు శౌర్యరాసి తలపడన్
వక్షము వగులగ పొపని
దక్షిణ బాహువున బొడిచె దైత్యుడు సమసెన్.

తనయుడ మేఘనాథ! భుజదర్ప సముద్ధరయేగి క్రోతినిన్
గొని యరుదెంచి మామదికి కూర్పుము పూరటనా అందెతనా
కని పటు బీరముల్ పలికి కార్ముకియై, రథియై, మహోగ్రుడై
పనిగొనె నింద్రజిత్తు సురవర్గము బంధుర చింతనొందగన్.

ఎవడురనీవు! రాగపనిఏమి వనంబును పాడుజేయుగా
నవసరమేమి? యేవిభుని ఆజ్ఞ నవజ్ఞ యొనర్చియుంటి మూ
ర్ఖువలెనటన్న, నేను నృపకుంజరు రాఘువుదూత వానినై
భవమిది వానియానతిన భంగముపుచ్చితి వచ్చియీగతిన్.

వనచర ! యిచ్చవచ్చినటు వాగకు సాగవు మేఘనాథుతో
జెనకిన ప్రాణి ప్రేతపురి జేరును మారును బ్రహ్మవ్రాత నా
శనమొనరించినావుగద శక్తి వివేకబలాఢ్యులైన మా
దనుజుల శిక్షకర్తుడవు తప్పక దీనికినీవు మర్కటా !

అని వివిధాయుధములతో
పెనగిన దోర్బలుడు వాని పెంపడగింపన్
గని బ్రహ్మాస్త్రంబును దా
ననుసంధానించి విడువ హరిపట్టుబడెన్.

కొని చని రావణు ముందల
నునిచిన రూక్షాక్షుడగుచు నురిమిపలుకుచున్
దనుజాధిపు డను క్రోతికి
చనునే యిటువంటిచేత శౌర్యధనులతో.

కాయలుమెక్కి స్వచ్ఛమగు కమ్మనినీటిని ద్రావిహాయిగా
పోయిన పోక కపిబుద్ధిని నిట్లు వనంబుగూల్తువే
రా ! యధమాధమప్రథమ ! రాక్షసవీరబలంబు జంపినా
నే యనుకొంటి తాడితగనెక్కిన నిక్కిన యెక్కుడుండరే?

కారుల నరచితి భటులను
గారించితి వనులనెల్ల గగ్గోలిడితో
క్రూరుడ నీపేరెయ్యది ?
యూరక నిటు సేయ నేమియొరిగెను నీకున్.

అనుచు దశాస్యుడాడ కనులంచున శాంతము ధైర్య మెంతయున్
దొఱకగ మారుతాత్మజుడ దోర్బలసత్త్వుడ రాముబంట నిన్
జెనకుచు సప్తవార్ధులను చెచ్చరముంచిన వాలి తమ్ముడా
నినకులు మంత్రిసత్తముడ నే హనుమంతుడనుమ్ము రావణా !

తలప జగత్త్రయంబునకు తల్లి- నిజంబుగ కల్పవల్లి- కే
వలమతిపూత సీత ! సుతవత్సలనెంచక హీనబుద్ధివై
చెలువుడు చెంతలేనితరి చేడ్పడితెచ్చితి- వచ్చి రామునిన్
కలిపితివేని ప్రాణములగాచును తా నభయప్రదాతయై.

మనుచు నిన్నటన్న మండె నగ్నివిధాన
వనచరుండ బ్రతుకపలచెదేని
నోటికైనయటుల మాటాడబోకుము
కరులు నిలువగలవె హరులముందు.

ఆహవభీములన్ దివిజహంతల మమ్ము నెదుర్చునట్టి స
న్నాహము మానుమంచు నరనాథునితోనను రక్తభోజులన్
సాహససత్త్వులన్ జెనకి చావగ నిచ్చయమైన వచ్చి మా
బాహుబలంబు చేవయును పొందితి చూడగవచ్చు హెచ్చుగన్.

నరులును వానరులును బళ
దరిసించిన నవ్వుబుట్టు తామింత మహా
గురుసత్త్వుల జెనకినచో
మరణింపక తిరిగిచనుట మాటలె తలపన్,

పలుకులు ముల్కులై యెదకు బాధనుగూర్పగ మోముదమ్మిపై
నిలువగ "నెర్వుడాలు" చెడనెంచిన మేలువచింప వచ్చునే
పలుకులు బాలిశుండవయి భండనపండితు రాముసెన్ను నీ
తల యొక కాలితాపునకు ధారుణిడుల్లును తృళ్ళనేటికిన్.

అను మారుతి పల్కులకును
ఘనకోపమునూని కత్తిగైకొని చంపన్
మును దూకగ మంత్రులు, దూ
తను జంపుట తప్పటన్న దశవదనుండున్.

వాలమునందు నగ్గినిడి. వానిపరాభవతప్తుజేయుటే
మేలన కోటలోనగల మెత్తని పుత్తడి వస్త్రసంఘముల్
జాలకపోయె తోక తెగసాగెను. జానకి కట్టుపుట్టముల్
దాలుపుడన్న తగ్గె తన తల్లికి పిల్లని భక్తిజూపగన్.

నూనియెబోసి అగ్గి తగనూల్కొనచేసి యతండు దూకగా
పూనిక తాళముల్ చఱచి పొంగుచు కేకలు వెట్టనేడ్చునే
మో నిజమో యటంచును ప్రమోదమునందిరి కుప్పిగంతులన్
తానిడి లంకసాంతము హుతాశను ప్రీతిగ నాహుతించెడున్.

మంచిగంధమట్లు మంచట్లు మిక్కిలి
చల్లనయ్యె స్వాహావల్లభుండు
రామభక్తి మదిని రాజిలుచున్నచో
వెట్టలేమి బాధపెట్టగలవు.

మారుతి తోకను నార్చక
చేరెను కపులున్న యెడకు శ్రీరాముమదిన్
జేరిచి ప్రార్థించుచు భవ
తారకమగు "రామనామ" తత్త్వము కలిమిన్.

పావనివచ్చి రాఘవుల పజ్జను జానకి లంకలోపలన్
జీవము నిల్పియున్న కథ జెప్పెను కన్నుల నీరు రాముడుక్
త్రోవగలేకపోయె పరితోషము కూర్చెడు భార్యకష్టముల్
గ్రావమువంటి పేరెడదకైనను ఖేదముపేర్చు పెల్లుగన్.

రాముడు సుగ్రీవాదుల
తో మంతనమాడి కీశదోర్బలవరులన్
సామంతుల గూరిచి సం
గ్రామార్థము చర్చజేసి కాగలపనికై.

భూమినభంబు వెల్లనయిపోయి నగంబు జగంబు సర్వమున్
స్వామి హితార్థమైనడువ జాతికిక్రోతులెయైన భక్తికిన్
యేమిలభించు పేదరిక మెంతయు సైనికవీరులట్లుగా
చీమలబారుగా నడచి చేరిరి సాగర తీరభూమికిన్.

ఒరులెవ్వరేసియు పరికింతురనియేమొ
దిశలెల్ల ముసుగిడి దిడ్డిదూరె
నీలవర్ణము వీడనెంచి కొండలవేమొ
ముద్దుముద్దుగ రంగులద్దుకొనియె

పట్టనేమొకొ నేడు పుట్టుభోగంబది
వెల్లగొడుగులు చెట్లువేసుకొనియె
మొలచెనేమొకొ తల ముత్యాల దండలు
పచ్చపైరులు తెల్లబారుచుండె

చక్రవర్తినైన సైనికున్నైనను
ఒక్కటుగనుతూచి యెక్కుతలకు
మూలమూలలందు ముసుగిడజేసె హే
మంత ఋతువు ఎంత హాంతకారొ.

దాటుట యెట్టులీయుదధి దారియొసంగదు యిట్టిపొట్లు పో
రాటము పోన రాగలుగ రాజెటులోర్చు నటన్న భీతి నా
రాటముజెంద వానరులు రాముడు కార్ముక మెక్కువెట్టి పో
రాటము సేయ వార్ధిపయి బాగెశరంబు కరంబులావుగన్.

బాణము నెక్కువెట్టుకొని పట్టినమాత్రనె వింటినారి తా
ప్రాణము చేతబట్టుకొని పాదములందున వ్రాలె వాహినీ
శ్రేణి విభుండు రాఘవుని సేవకు నోపడె కట్టగట్టె నా
ధీనిధిచేత మానవుల తెల్వికి విల్వయొసంగినట్లుగా.

కొండలుచేర్చి వృక్షములుగూర్చి లభించిన రాలుచేర్చి నీ
లుండను శిల్పిరాజు కొనలూరిన ప్రేమను కట్టగట్టుగా
బండలు తేలె బెండ్లవలె భాస్కరవంశము నుద్ధరించు రా
ముండు కృపాపరుండు నిడు ముక్తికి బాటిటులుండునన్నటుల్.

జలచరములు వనచరములు
కలసిమెలసి రాముపనిని గావింపంగా
దలపడుట గాంచి తనమది
తలచెను ఒక యుడుత భక్తి తాత్పర్యమునన్.

కొండలు మోతునా ! తలచుకొన్న భయంబు, నగాలు పీకగా
గుండెబలంబులే దురక గూర్చొన బుద్ధి జనింపదేమి కా
నుండెనొ ! ఈశ్వరేచ్ఛ కొనలూరిన ప్రేమస్రవంతి వెల్లువై
గుండెలుసిండి పొర్లెరఘుకుంజరు సేవకుత్రోవయేదియో.

స్థావర జంగమంబయిన సర్వప్రపంచము రాముసేవకై
పోవగ నల్పజీవినయి పోతిని స్వామికి పన్కిరాని యీ
జీవమికేల నంచు ధృఢచిత్తముతోజని నంబురాశిలో
జావగదూకె నేటికిక సార్ధముగాని శరీరమన్నటుల్.

బుడిబుడి నంబురాశిబడి పోయి తటంబున బొర్లుసంతతో
విడువక వార్ధిగట్టుదెస వేగమెచేరి శరీరమందునన్
బడిన రజంబుతో యిసుక పారగ జల్లును సృష్టిధర్మమే
బడియయి పాటమేమయిన పల్కెనొ అల్పపుజీవి వీసులన్.

ఉడుత చేతకపుల నుబ్బూతలూగించె
వింతనవ్వుతోడ గెంతజేసె
నాత్మతత్వవేత్త యగు రామునకుగాక
అల్పజీవి హృదయ మర్ధమగునె ?

చిరునగ వాననంబునను చిందులు ద్రొక్కగ నుత్త ప్రేమతో
కరములబట్టి రాఘవుడు గాఢవిషాద భరంబు ద్రోయగా
తెరవన వింత పుల్కలను తేలగ నంగములంటి స్వార్థమే
మెరుగని దాని మేననిడె మిత్రత పాత్రత గుర్తు వ్రేళులన్.

ఋషులుగాని దేవవృషభశేయుగుగాని
స్వార్థరహితసేవ సలుపలేరు
కోర్కెలెల్ల నడచుకొని రాముసేవలో
నిలచె యుడుత భాగ్యఫలమదేమొ.

ఉరుకులతో పరుగులతో
నురుగులు గ్రక్కుచునువచ్చి నూత్నజవముతో
శరనిధినాథుడు రావణు
పరికించి వచించె నిటుల భయసంభ్రముడై.

రాముడటంటు భూమిగల రాజులలోపల మేటియంటు సు
త్రాముని శిరకిఁగొనని ధన్వియు వీరకిశోరమంట నీ
వేమి యొనర్చితో చెఱపు వీరడివై కపిసేనతోడ నా
శ్యామల కోమలాంగుడు అసాధ్యుడు నిల్చెను నాతటంబునన్.

కొండలు బెండులట్లు అనుకూలత నీటను దేలియుంట యెం
దుండెను యీ అయోమయము తోచగనీయదు బుద్ధి యింక నా
శౌండుడు వచ్చి లంకతన శౌర్యముచూపకమున్నె నీవు నీ
పౌండిమిజూపి యెట్లయిన పౌరగద్రోలుము వైరి రావణా.

సాగరుడుండె నండయని స్వాంతము నందుతలంచి హాయిగా
సాగగజేసితిందనుక సాహస విక్రమకేళి నింక పై
సాగదు ఆటకట్టినదిసామి యదార్థము విన్నవించియున్
యేగదలంచినాడ తమయిచ్ఛకు వచ్చిన త్రోవద్రొక్కుడీ.

శ్రుతిపేయము నొనరించితి
వతిశయ మమృతాభిషేకమగు నీ నుడులన్
మతిమంత ప్రతిఫలంబుగ
జితరత్నచయాలు గొనుము చిరభూషలుగా.

కాచియుంటి నింతకాలంబు నాపతి
నాదుగతియు లోకనాథుడైన
రామమూర్తి విమల శ్యామసుందరమూర్తి
వచ్చి భవభయంబు పుచ్చుననుచు.

మాడువు లీయుమంచు బ్రతిమాలితినా? ఘనరత్నరాశికై
వేడితినా? కృతార్థతకు వేలు నొసంగగ కోరియుంటినా?
వీడక యిల్లుగాయుమని వీరడినై చెయిజాపియుంటినా?
రాడిదియేమి? మాయరఘురాముడు శ్యాముడు భక్తరక్షకై.

తమనుడాయజాలు దారులన్నియుగూడ
నతడు మూసియుండె నైనగూడ
నన్ను జేరునట్టి తెన్నులవన్నియు
నేను తెలిచినాడ వానికొఱకు.

తాపసుల్ వధించి చెఱదొరిచి స్త్రీలను యజ్ఞయాగాముల్
కోపముతోడ నిష్ఫ్రుపను గూలిచి నేగలచోటుస్వామికిన్
జూపగనెంచియుఁ గరుణజూపకు మోపడులంకకాలు నా
తేప రఘుప్రభుండుకులదేవత నే హతభాగ్యుడఁగదా !

పొత్తిలిగుడ్డ లందొలకబోసిన ప్రేమలచిన్ని పిల్లలన్
మెత్తలనొత్తి సత్యమిడి మించినయుగ్గుల నిగ్గుదేల్చు నా
యుత్తమమైన మాతయయియున్న మహా సతి సీత దెచ్చి రా
జోత్తము దృష్టిద్రిప్పితిని జోగికి పెన్నిధి యబ్బెనేటికిన్.

తల్లి చెఱను నిల్పె దశకంఠుడనుగాని
లోకమెపుడు లోనిపోకగనదు
చక్రవర్తిరామచంద్రు సద్గుణసాంద్రు
దర్శనంబు సేయదలచిగాని.

వారిధినాథా రాముని
కారణమున నాదుజన్మ కర్మలడంగుఁ
కూరిచితమ్ముది నీదయ
పారము వచియింప శేషఫణికేనగునే ?

దశకంఠుడు చేసినపని
నశియించుటకే యటంచు నాతియు తమ్ముం
డు శతంబుజెప్ప వినకను
నశియించెను సుతులతోడ నాహవభూమిన్.

సాత్త్వికుండు శీలిసన్మార్గనిరతుండు
విపుల భక్తుడగు విభీషణుండు
సచివ వరులు గొలువ చనుదెంచి రాముని
శరణుజొచ్చి సంఘ మరణమాపె.

కపులకు దానవులకును
విపుల రణంబయ్యె నందు వీరు లిరుతెగల్
అపరిమితంబుగ జచ్చిరి
విపరీతపు బుద్ధియైన వెంగలి కతనన్.

చెట్టులుబీకి కొండలను చేతులబట్టి యురాలగొట్టియున్
బిట్టుగ శీర్షముల్ పగుల ప్రేగులు బిండిగ రాల భూమిపై
గట్టిగగొట్ట కీశతతి గాఢజవంబున సంగరస్థలిన్
గుట్టలుబెట్టి రార్చి తమగొప్పకు రక్కసులెల్ల పిప్పిగన్.

ఉరిత్రాళ్ళవలె తోకలరుల కుత్తుకలకు
దగిలించి యిట్టటు దాటువారు
పదనుగల్గిన పండ్లబట్టి గొంతులు జించి
దగగొని నెత్తురు త్రావువారు
బల్లెపువలెనున్న భయదమౌ గోళుల
చించి ప్రేవులు మెడనించువారు
శిలలతో నెనవచ్చు తలలతోడను మోది
యురములు పిండిగా నురుముువారు

కాళ్ళనిరికించి దిక్కులు కలయద్రిప్పి
గ్రుడ్లు వెలయించి పిడికిళ్ళ గ్రుద్దువారు
భూత ప్రళయంబె యొకమారె పుట్టినట్లు
క్రోతులెల్లను రంపపు కోతగోసె.

సౌమిత్రి మూర్ఛపోవగ
సామీరిని పంపి తెచ్చి సంజీవిని ప్రా
ణామృత భిక్షసిడియె శ్రీ
రాముడు గురు భ్రాతృప్రేమరాశి యగుట చేన్.

అల ప్రహస్తాది మంత్రులు అధికబలులు
విడచిరసువులు నందుపై వీరవరుడు
కొమరుడౌ మేఘనాధునిగూడ బంప
సమసెనాతడు సౌమిత్రి సాయకముల.

తలపగ మేఘనాధుడను దానవుడద్భుత బాహువిక్రమా
కలితుడు అంజనాసుతుని గట్టినజెట్టి యొకమ్ముచేతనే
యిలబడ లక్ష్మణుఁ గెడపు నిద్దబలుండు మహోచ్ఛశీలియుఁ
తలదెగికూలె కర్మమును దాటగలేరెటువంటి ప్రాజ్ఞులున్.

కుంభకర్ణు డంత గొప్పవీరుడుగూడ
పడియె నొక్కయమ్ము విడచుమాత్ర
తుక్కురక్కసులకు లెక్కయే సంద్రంబు
లీద పిల్లకాల్వ లేమి సేయు.

కత్తులుదాల్చి భల్లములు గైకొని బాణములూని ఘోర నా
బత్తుల మ్రోతలన్ రిపుల భండనభూమిని చించి చెండ నా
యుత్తమునౌచు సింహమున నద్రులు వ్రీలగ నార్చుకొంచు లో
కోత్తర వీరమూర్తి రిపుకోటి భయంకరుడౌ దశాస్యుడున్.

వచ్చినిలిచి రఘురాముని
నచ్చరితునిగాంచి నవ్వి నద్దారుతవే
మెచ్చితి యిటువలె కదనము
రెచ్చి యొనర్చెదవొకో? సరే యికచనుమా.

ఆడుది తాటకన్ దునుముటా యిది, శూర్పణఖాతలోదరిన్
ప్రోడగ భంగపుచ్చుచును బొమ్మనుటా ? యొక లేడినల్కమై
గాడగనేసి చంపుటయొ కాదిది రావణుతో నెదిర్చి యీ
నాడుయొకింత పోరునెత నాపస నీపస గాననయ్యెడున్.

పోతరిపై జగత్త్రయ ప్రపూజ్యను సీతనుదెచ్చి దాచు నీ
పాతకమెల్ల బాపెదను పట్టిసతోమరకుంతలాది వి
ఖ్యాతములైన యాయుధ ప్రకాండము లుండినవంచు పొంగు దు
ర్జాతుడ ఘోరమౌ విశిఖ రాజికి నాజినినిల్వు రావణా!

మారుతిచేత సంధియగు మాటవచించితి శాంతిగామినై
వీరడివౌచు వీనులను వెట్టక చుట్టలతోడ నాజిలో
తీరగనెంచితాపయిని దెల్పెను తమ్ముడు అన్యకాంతలన్
గోరుట నేరమంచు వినగూడదొ ప్రాణము నోమగూడదో.

నమ్మినవారి మిత్రముల నాశము చేయుచు అందచందముల్
సొమ్ముగనున్న లంక చెడజూచితి నీచమువెల్లకాల్వనే!
సమ్మతి కోటిలింగముల స్వామికి వేకువమాయకుండ ర
క్తమ్మున పూజసేయు కృతకర్ముడ వమ్మయెనన్ని నీకడ౯.

బంధురకాంతి పాళములు పల్కిన వీనుల బెట్టకక్కటా!
రంధినిగోరి చిక్కనగు రక్తము త్రాగుపిపాసచేతనే
సంధికి హంసపాదులను సల్పితి మల్పితి బ్రహ్మవంశ సం
బంధము బంధునాశనము ప్రాజ్ఞులునోర్తురె పంక్తికంధరా!

పవన పర్ణాశనపరులైన మునులను
బలుబాధలనుబెట్టు తులువతనము
పరనారులను తల్లిభాతి భావింపక
తెచ్చి చెరలనుబెట్టు మ్రుచ్చుదనము
ప్రకృతి సిద్ధంబైన పర్ణశాలలనెల్ల
కాల్చి భస్మముసేయు గడుసుదనము
సాధు శాంతులు గీశసంఘుంబు బవరాన
పరిభవించినయట్టి దురుసుతనము

నిన్ను మట్టుబెట్టు నెఱజోదువైనను
యోధవైన స్నేహయోగ్యుడయిన
వీరశైవవ్రతుడవే యైననేమిలే
పంక్తివదన నీదు ప్రాణమార్చు.

అని రాముఁడు వచియించిన
విని రావణుడనును చాలు వీరమ్మన్యా
కనులను కెంపు నటింపగ
నని సేయక బోధలేల నాహవభూమిన్.

నరుడవునీవు నీపలుకు నవ్వుజనించును లిప్తలోపలన్
చెఱకును యేస్గుమాదిరిగ జీల్చుకతిందుము మాదుశక్తి నీ
వెరుగవు మించిపోదెదియు వేగమె కోతుల గుంపుతోడ నీ
పురమునుచేరి రాజ్యరమ పూనుము మానుముప్రేమ భార్యపై.

పుణికిన పాలుగారు పసిబుగ్గలవాడవు యుద్ధభూమిలో
ఖణిలు ఖణీలు మంచనెడు కార్ముకకోటుల ధాటికాగగా
వణకెదుగాన జెప్పితిని వానిని వీనుల బెట్టవేసి నీ
పనియిక నర్వహాస్యమగు పొపము యింటికి పొమ్ము సత్వరన్

అమ్మయు తమ్ములు నీకై
గుమ్మమున కాచియుంద్రు ఘోరాహవమీ
వెమ్మెయి జేసెదు యింటికి
గుమ్మనజని రాజ్యమేలుకొను శాంతముగన్.

అనుచుదశాస్యుడాడ కనులందున నిప్పులుజిమ్మి కారుక్మ
మ్మును దగదీసి ఘోరశరముల్ ప్రసరింపగజేసి యంత నా
జనవిభుడార్చివైవ పొడిసల్పెను వానిని మధ్య రక్కసుం
డినకులుడంత వ్రేటువడి డీల్పడి గ్రోల్పులియాచు గ్రమ్మరన్.

భల్లము పేరియాయుధము పట్టి కరమ్మున వైరిశీర్షముం
ద్రెళ్ళగగొట్ట తేరుకొని దేవరిపుండు విరోధివక్షముం
జెల్లుగనాట నంప పొడిపెట్టెను నెట్టెను లోనిభీతి వి
ద్యుల్లతపోలె రాఘవుడు దుర్భర ఘోర కఠోర కోపుడై.

రూక్ష తీక్ష్ణేక్షుడై వైరిరూపుమాప
నెంచి యాకర్ణముగ ధనువెంచి వంచి
సత్యశీలి సమంత్రంబుసలిపి వేగ
వైచె రావణుమీద దివ్యాస్త్రగములు.

తరువటు భూమింబడియును
పోరిపోరి పదితలలు బొడమి పూర్వ నిలింపా
భరణుడు రావణుడప్పుడు
ఉరికెను రణభూమికదలి ఉబ్బాగంగన్.

రాముడెన్నిమార్లు భూమినిగూల్చిన
వెండి తలలు మొలచుచుండె నేమి
ఘన విశేషమనుచు వినువీధినున్నట్టి
దేవతతులు డిల్లపోవుచుండ.

అనుజుడుఎన్నిమార్లకును ఆహవభూమిని మ్రందకున్న యా
దనుజ కులాభివర్ధనుడు దానవనాథుని చిన్నితమ్ముడున్
ఘనుడు విభీషణుండనును గర్భసుధాకలశంబు వ్రయ్యలై
చన విడు మొక్క సాయకము సత్వరమే మరణించునాతడున్.

అని యింటిగుట్టుదెలుపుచు
తన అన్నను చంపుకొనియె తమ్ముండయ్యుఞ్
దనుజ కులమెల్ల నోమగ
మనమందుననెంచె నెంత మాన్యగుణుండో.

గుట్టు సమస్తమున్ దెలిసికొన్న మహాత్ముడు రాము డల్కతో
ఘట్టనసల్పి ధారుణి ప్రకంపముగా నొక కార్ముకంబుచే
పట్టి శిలీముఖంబునను బాణము భిన్నముచేసె యమ్ముచే
గొట్టగ పంక్తికంఠరుడు కూలె రణావని వాల నార్చుచున్.

విప్రవరుడు ఆత్మవేత్త వీరుడునైన
రుద్రభక్తు డమల భద్రబలుడు
విశ్వజేత ప్రాణవీడి ధారుణికూలె
దశగళుండు స్త్రీల వ్యసనపరత.

శివుని శిరమందు శింగారమొలికించు
దైత్య భర్త తలలు ధరణిపొర్లి
గ్రద్ద కాళ్ళచేత కలయు ద్రొక్కంబడె
కర్మఫలము దప్ప గలుగునెవడు.

సంపదలార్చు కష్టముల జన్మముచేర్చు సఖుంబుఛేర్చు తూ
లింపగజేయు సౌఖ్య లంతేయము నాశమొసంగు వచ్చునా
కొంపల నిప్పుపెట్టు ననుగుణ్ సుతులెల్లర చుట్టపక్కముల్
రంపపుకోతగోసి తుద ప్రాణముదాచ్చు పరాంగనారతుల్.

గంగిగోవువంటి కన్నతల్లికిగూడ
తప్పదయ్యె నగ్ని తప్తయగుట
నీతి దాహమున్న జాతిరా నరజాతి
అమృతఝరికి మురికి నంటగట్టు.

శానమీద కట్టి మాణిక్యమున్నట్లు
పుటముపెట్టినట్టి పుత్తడియన
తీర్చినట్టి పులక తేనియ యనాటనా
పూతమయ్యె లోకమాత సీత.

సానబట్టినట్టి జాతిరత్నము సీత
కేలువట్టి రాజ్య మేలుకొఱకు
కదలె లంకనిల్పి ఘనవిభీషణునితో
శాంతి సమత ప్రభుత సలుపుమనుచు.

తమ్ముతోడ భూమితనయతో కపులతో
సాధువైన దైత్యనాథుతోడ
పుష్పకంబుపైన పోవ నయోధ్యకు
బయలుదేరె నడిమి బాటలోన.

బ్రాహ్మణుండు రుద్రభక్తుండు పౌలస్త్య
జంపినట్టి పాపచయమునెల్ల
బాపికొనగ రామ పరమాత్మ మనమున
నెంచి వార్ధి సేతువుంచునెడను.

సోమకళాభరణుని రఘు
రాముడు జలధితటమందు రాజితభక్తిన్
కామిత మీడేర్పగ నిడె
రామేశ్వరమదియె దురితరాశియడంచున్.

సైకతలింగమంట యఘశాంతినిగల్గగజేయునంట లో
శోకమునార్చి ముక్తియను సౌఖ్యమును నిమ్ముగ నిచ్చునంట నా
శీకభవాది దేవతతు లీ ఘనభూమినిమెట్టి కష్టముల్
లేక భవంబు నాశమగు లీల తరింతురు వేయిభంగులన్.

వైరియైన పాపవర్తనుడైనను
క్రూరుడైన లోకదూరుడైన
రావణునకు ముక్తిరమకూర్చ రాఘవ
దేవుడిచ్చె కీర్తిజీపనంబు.

కదలి యటనుండి త్రోవను
నదులును కొండలును పొదలు నానావిధముల్
మదిరాక్షికి జూపించుచు
సదమల పుష్పకముపైన సాగుచిటులనెన్.

ఇదె ఋష్యమూకమౌ నిచటనే కీశుల
చెలిమిం పెన్నిధిగాగ చేతికబ్బె
ఇదియె పంపాతట మిచటనే భిల్లెత
తీయతీయని తేనె తెచ్చియిచ్చె

ఇదె జటాయువు పై రి నెదిరించి మరణించి
నాచేత పితృవిధినందుచోటు
ఇదె చిత్రకూటము ఇందె బంగరులేడి
తోచి మోసముచేసి పీచమడగె

అదియె పర్ణశాల అయ్యదే మనముష్టు
పెంచుకొన్న మయూర పంచకంబు
అనుచు సీతతోడ ననుభూతి బల్కుచు
రాఘవుండు చేరె రాజధాని.

అదియే అయోధ్య పత్తన
మదియే సరయూస్రవంతి ఆపొంతలదే
సుదతీ మన యంతఃపుర
సదనము చని కనెదమంచు సాగిరిపురికిన్.

---

# రామరాజ్యము

## తుదిపాలు

తనకొరకై తపియించు చిన్నతమ్ముల నక్కునజేర్చి తల్లులన్
గనుగొని హర్షబాష్పములు గాద్గదికమ్మును క్రమ్ము గొంతుతో
పసవుచు పాదముల్ కడిగి వారిశిరంబున జేర్చి రామ భూ
జనపతిజేరె పుష్పములు జార్చనిలింపుల గుంపుమింటిపై.

స్వాగతమంచు భూప్రజలు సన్నుతిచేయగ మౌనివర్గముల్
స్వాగతమంచు అర్చనలు సల్పగ మంత్రులు తోషమంద న
భ్యాగత అర్ఘికల్పకము ఫక్కిని బంధురప్రేమ సీత అం
దీగ ననర్ఘరత్నములు నిచ్చెను రాముడు త్యాగశీలియై.

ముత్తియంబుల వీధిముంగిట ముగ్గుల
తీర్చికంబళులను పేర్చినారు
కప్పురంపుననంటి కంబాలుకొనివచ్చి
నిలువుస్తంభాలకు నిలిపినారు
కస్తూరిపన్నీరు కలిపిసమంబుగా
వట్టివ్రేళ్ళను చల్లి కట్టినారు
వెల్లవేసినతెల్లతెల్లనౌ గోడల
రామనామంబును వ్రాసినారు

పచ్చిపచ్చని తోరణాల్ గ్రుచ్చిగారు
ఆటలను పాటలను రాము అఘవిరాము
మంజులశ్యామ జానకి మహితకాము
తలచినారు పురంబున గలుగుప్రజలు.

జానకిఅంకభాగమున చక్కగ మక్కువలూరనుండ సం
ధానితమైన చామరలదాల్చుచు లక్ష్మణుడోరనిల్వగా
ప్రాణము వానిసేవకను పావని దండను గొల్వ కీశ సం
తానముమెచ్చ రాఘవుడు తాగురునాజ్ఞను నెక్కెపీఠిపై.

కిన్నరులాడ అచ్చరలు గీతముబాడ ఘనంఘనార్భటిన్
మిన్నుననుండి దేవతలు మించుల పుష్పచయాలు నించ రా
మన్న జనాభివృద్ధికయి మాపును రేపు శ్రమింతు నేనటం
చన్న మనోహరంబయిన శబ్దము దిక్కుల మ్రోగెగ్రక్కునన్.

గురుడు వశిష్ఠుడు ఆశీ
స్ఫురణంబుగ చేయిజేర్చి శుభవీక్షణలన్
పొరిపొరి దీవింపంగా
నరదానవ విభులు కొలువ నమరులుపొగడన్.

రత్నపీఠినెక్కె రామరాజ్యంబిది
అనుచుప్రజలు తన్ను అహరహంబు
కీర్తనంబుసేయ స్ఫూర్తితోక్షుద్బాధ
లార్చి ఏలెధర ననామయముగ.

ఒకరోజు రామచంద్రుడు
సకల ప్రభువులండనిలువ సచివులు బంధుల్
నికటముననుండ కొలువై
ప్రకట విభవమొలుకుచుండ భయకంపితయై.

కుక్కయొకండు తామొరుఁగుకొంచును రాఘవుపాదపీఠికిఁ
చక్కనమస్కరించి నృపచంద్రమ నేనొకచేవళాన పెం
పెక్కిన అర్చకత్వమున వెన్నిధి అబ్బినదంచు మెక్కి యీ
కుక్కగపుట్టి నీప్రజలు కొట్టగవచ్చితి బాధపెంపునన్.

ఉడుతను శబరిని గాచితి
పడతిని గావించి తడవి బడియున్నశిలన్
కడుదయ వైరిని బ్రోచితి
అడుగులబడువేపికుయ్యి ఆలింపగదే.

అని తపియించు జాగిలమునారసి పూర్వపు జన్మయోగ్యతా
ఖనివయి దైవభోగ్యమును గైకొని మెక్కి అధర్మవర్తనఁ
మునుగొని కుక్కరూపమును పొందితి ముందరికర్మబంధముల్
తునిచితి నేటికైన సిజదోషము సాంతము అంతమౌటచే.

విప్రవిత్తమనలె విషమందు పైనను
దైవద్రవ్యమధిక ధారుణంబు
ప్రభునిగాని దైవవిభునినేయగుగాని
రూపుమార్చి మచ్చుమాపివేయు.

నీవగ సర్వముజారగ
త్రోవయిది యటంచు నవ్వుతో రాఘువు డా
జీవిని శ్వానము బుణుకగ
నే వదలుచు కుక్కనిలిచె నిజరూపమునన్.

భద్రగుణుడు రామభద్రుడు యొకనాడు
భద్రుని బిలిచి వేగుపనికి బనిచి
నాల్గువీధులందు నడయాడివచ్చిన
అనుజవరులతోడ ననియెనిట్లు.

రాజు చందమామ రక్షితామరనీమ
ప్రజకు వెలుగు జానపదులవైన
కష్టనిష్ఠురముల గనకున్న మనియున్న
ఖ్యాతిసున్న బ్రతుకుగాదె అన్న.

అన వచియించు లక్ష్మణుడు అందము చందము చింద హాయిగా
పెనిచెడు రామచంద్ర నృపుప్రేమలు మోముల వెల్గుబెట్టగా
జనములు యెల్లవేళలను చాతకబంధుడు సత్యసంధుడౌ
నని యనుచుండ విందు మనమందు చెమర్చి నమస్సుసల్పగన్.

బాలమృతులుగాని పశ్యతోహరవృత్తి
నూనునట్టి దొంగవానిగాని
ప్రాణి హననబుద్ధిగాని కానగరాక
రాష్ట్రమెల్ల రామరాజ్యమయ్యె.

రామ ! గుణాభిరామ ! అభిరామ ! యశోధనకామ భద్రుడన్
స్వాముల సేవకుండ జనసంఘము మిమ్ముగురించి వీధులన్
ఏమనుకొందురో మెరుగనేగినవాడను యెల్లచోటులన్
మీమహనీయకీర్తిరసమే ప్రవహించెను తావినించుచున్.

అనుచు భద్రుడనగ నవునవు సేవకుల్
స్వామిభక్తిపరులు స్వార్థరహితు
లట్టివారిచెవులు నధిపుకీర్తనగాక
యితరమేమి వినగ నిష్టపడును.

చల్లనివాడనంచు జనసంఘములోపల కీర్తిచంద్రికల్
కొల్లలుకొల్లలంచు నృపకుంజరు రాజ్యము రామరాజ్యమై
ఉల్లము పల్లవించు నటులుండెనటంచనుమాటె, చంద్రులో
నల్లనిమచ్చవోలె కన నా పొరపాటును రిత్తపాటునున్.

అని రాముడనగ భద్రుడు
కనులను కన్నీరు చింద గాద్గదికతతో
మనవులు తడబడ నీచులు
అనినవి చెవిపెట్టదగునె అర్యోత్తములున్.

తప్పుచూపి తనదు ధర్మంబు ప్రేరేపి
యుక్తకర్మచేయు నూహగరపు
ప్రజలు తుచ్ఛులెట్లు ? ప్రాణాలు రాజుకు
అగుట నుడుల మీరనగునె ప్రభువు.

అనిరఘురాముడాడ పురమందలి గొందులు సందులెల్లనుఁ
గనుగొని వచ్చుచుండ నొక కల్లరి చాకలి భార్యయెంతయో
పనవుచు కాళ్ళ(వేళ్ళబడి ప్రార్థన చేయగ చావబాదగా
జనములుచేరి అపదగు జాడలు గాంచిరి మేలుతెల్పుచున్.

మడిచేలు వారిమాటల
కడుకోపమునూని భార్యగారించగ, నా
పడతియు కనులను న(శులు
విడచుచు శోకించె గుండె(వీలెడురీతిన్.

అత్తరి నేనుజేరి కథనారసి యీపని మానుమంచు రా
జోత్తమ ! చెప్పిచూచితిని సుంతయు వాడది మానడందుపై
చిత్తముమార్చ రామునకు జెప్పెద నీకథ, ఘోరశిక్ష కా
యత్తుడవౌదువన్న నగి యాతడు ఆడెను (ప్రల్లదంబులన్.

అవి నుడువజాల రాఘవ !
పవికన్న భయావహాలు పాములకన్నఁ
మివుల విషసదృశలగు, న
య్యవి విన్న చమర్చుగుండెలద్రులెయ్యైనన్.

భద్ర ! అన రామభద్రుండౌ నామీద
ఉన్న కథలను తెలుపు విన్నయట్లు
మేలువించు కీడు తూలింపవచ్చునే
షర్వసముడుగాదె చక్రవర్తి.

కష్టము నిష్టూరంబని
స్పష్టము జేసెదవు మేఘసంతతి యురుమ౯
యిష్టము చెవులకుగాదని
వేష్టపడగ యిడెడువాన హితవయ్యేనే ?

అనగను భద్రుడాడునిటు లారజకుండను లంకలోపల౯
దినములు త్రోసియున్నసతి దెచ్చెను రాముడు యేలె, యెంగిలై
నను అటుసేయుమంచనగ నాతనికెక్కడిహక్కు రాజులై
నను ఇటు తప్పుసేయునెడ నాగతి సేతురె యెల్లవారునున్.

తప్పుసేయునట్టి తరుణిని దశకంఠు
గీములోనున్న భామదెచ్చి
ప్రక్కనిలుప, రామభద్రుడనేగాను
తెలిపి నాదు తలను తీయుమనుము.

పలుక నలుగురు ఛీ! యని, పాపియనుచు
మొగముననుఊసి గృహములో మూలనెట్టి
తలుపులను వేసిరచ్చట నిలువలేక
తలనువంచుక నేనింటి దారిబడితి.

పలుకులు ములుకులవలె చెవు
లలయింపగ గుండెలవియ లావరిమూర్ఛ౯
ఋలపతి మునిగెను తేర్చగ
పలపల సేవకులు వచ్చిపడిరి క్షణమునన్.

మూర్ఛతేలి రామమూర్తి ఆర్తినిపొంది
సోదరులను భక్తి మేదురులను
పిలిచి జనమునిందతెలుప లక్ష్మణుడంత
కత్తిదూసి యొక్కగంతువేసి.

ప్రల్లదియవ్వడో పరమపావని సాధ్విని లోకమాతనుః
కల్లలనాడ, నాతడను కట్టుకథల్ విని ప్రాజ్ఞవర్తనల్
చెల్లగజేసి పామరులు చేసినయట్టులె చేయవచ్చునే
చెల్లరె రామరాజ్యము నశింపగ చేయగనెంచెనెవ్వడో.

వానితలను దూల్చువత్తు నానతియిండు
అనుచు కనుల నిప్పు కణము లొప్ప
సత్వరాశియైన సౌమిత్రి కౌగిట
పొదివి రాముడనియె మదిచెమర్ప.

ప్రజలతీర్పు రాజుపాలింప కావల
నెట్టివేయునెడల నెట్టులన్న
ముందుముందు జనులు అందురుకాదొకో
మనల ధర్మమెల్ల మరచిరనుచు.

భరతుని విడ్చిరమ్మనిన పాపముమిమ్ము వనాలద్రోలి యే
కరచి అనంచు తాననియెకాదనె గాదిలి తమ్ముగుట్ట నీ
శిరమునదాల్చు మిద్దియన సీతనుమాతను లోకపూతనా
కరముల కాన ద్రోయుపనిగాదెనె లక్ష్మణుడార్తరూపుడై.

మేలువేళయెడలె మిత్రులు తమ్ములు
కష్టకాలమందు గర్భవైరు
లనెడు మాటలందు గనరాదసత్యంబు
నింద నేనె బాపికొందునింక.

అనుచు రాఘవుండుజసస కన్నతల్లిని
గర్భభారఅలస కరుణలేక
వనులడించివచ్చు పనిగొనె లక్ష్మణు
డన్నమీద ప్రేమ మిన్నుముట్ట.

మునుపెపుడో మనోహరుని ముచ్చట దీర్పగగోరె జానకి
వనజదళాక్షి తాపసుల వాటులగాంచగనంచు నూతగా
గొనియది రామచంద్రుడనుగుంసతి కానడించబంపె తా
జనములమాట రాజులకు చక్కనిబాట యటంచు చాటగన్.

రథముపైన గృధ్రరాజియాడగసాగె
దెసలుసోణితాన తేలుచుండె
జంబుకముల రొదలు చెవులు బ్రద్దలుచేసె
మరది ! అందలంబు మలుపవయ్య.

పులులును యెల్గులున్ అడవిపుట్టలు పాములు గీములన్నియున్
కలవరపెట్టు నెమ్మదిని కాతరయై జనకాత్మజాత రా
వలసిన త్రోవతప్పితిమి వత్స ! యటన్నను లక్ష్మణుండు తా
పలుకడు మోము త్రిప్పడగు పాపికియొప్పునె వాయివిప్పగన్.

కన్నుల నీరమేటికి గల్గెను ? అ_త్తలకెల్లవారికిఁ
అన్నరొ ! క్షేమమే ? ప్రజలకందరికిఁ కుశలంబె ? మౌనముఁ
గన్న భయంబుపుట్టె మదిగారియబెట్టెనిదేల ఏమి నీ
చిన్నెలు మారుపల్కవు వచింపవు వింతలు సొంతమొక్కటన్.

జనులాడుకొనెడి మాటలు
వినిరావణు యింటనున్న విద్రుమముఖి తా
గొనివచ్చె రాముడనిరని
నిను కానల డించుమనియె నిర్దయవశుడై.

అనగ మూర్ఛపోయి అవనిపై తెలివొంది
కనుల నుండి నీరు చినుకుచుండ
నాదు గుణమునెరుగు నాథుడు జనమను
నిందవినుచు వీడ నెంచుకొనెనె.

అ_త్తల నడిగితి ననుమా
చి_త్తంబున భృత్యగణము చేర్చితిననుమా
మె_త్తని మాచెలియంద్రను
ఉ_త్తమ ఫలమందె ఆశిసుంచితిననుమా.

రాము సంతతాభిరాము సద్గుణధాము
మంజుగుణుని హృదయ కుంజస్థితుని
విడచు చింతకాక కడమ నాకేమియు
కొదువలేదు కీ_ర్తిగొనుత ప్రభుడు.

సాహసించి యేమి సలుపకునీలోన
పసిడి మొగ్గలలోని ఫలమువోలె
పొటమరించు చిన్నిబుజ్జాయిలున్నారు
సూర్యకులము వెలుగు జూపువారు.

అని ఆమె శోకవశతను
గనజాలక వనమృగాల గని నూఅమ్మ
పెనుచుడు మనుచుడు కీర్తిని
గొనుడని తా కేలుమోడ్చి కోమలిపదముల్.

కనులనద్ది కదలి కన్నీరు మున్నీరు
తొణికి చెక్కుల దిమ్మి పుణుకుచుండ
మరది తల్లికన్న మర్యాదవదినను
కొలుచుకొన్న అమల గుణుడు చనియె.

కన్నులనీటితో మనసు గారియ పెట్టెడు పేరెలుంగుతో
మిన్నును మన్నునేకముగ మ్రింగెడు శోకరసస్రవంతితో
బన్నములందు జానకికృపాపరుడై యెదజేర్చి తండ్రియో
యన్నవిధాననాదుకొనె నా మునిరాజు సుధామయాత్ముడై.

అతడు తొలికవియౌ ప్ర
చేతసుడగు రాముచరిత చేసిన సుకవి
త్వాతిశయుడు ప్రేమామృత
స్ఫీతుడు ధరణిజను సాకె సిలుగులణచుచున్.

పూలుతావితోడ పొదలెడుమాదిరి
తేనె పెరలు సుధల నీనినట్లు
చందమామ వెలుగు జల్లెడిమాదిరి
సీతగనియె సుతులపూతగుఞల.

కుశుడని లవుడని వారికి
శశిముఖినామములువెట్టి సంయమికరుణన్
దశరథసుతు సత్తపమున
వశులైన రవీందులనగ వర్ధిలిరెలమిన్.

పెరిగిరి విద్యలగరచిరి
యురుశాస్త్రము లభ్యసించి యోగ్యతరంబౌ
పరిణిద్ధ అస్త్ర శస్త్ర
స్ఫురణంబులుగనిరి తాత సునిశితశిక్షణ.

తాత రచించు రామకథ తంత్రులతోడను మేళవించుచున్
పూతలుబూసి మోడులును పుప్పొడిరాల్పగ రాలు నీరుగా
మోతలువెట్టి సర్పములు మోములుయెత్తి నటింప కోవెలల్
కూతలుకూయపాడి రనుగుంజెలు లచ్చరువంది మెచ్చగన్.

తల్లి తలపుపండి తావులు నిండెను
కనులలోని నీరు యినకసాగె
చందమామలట్లు అందబుచిందెడు
కన్నసుతుల మోములున్నజూచి.

తలపగ జానకీహృదయధాముడు రాముడు పెల్లుచింతచే
కలతనుచెంది యజ్ఞమునకై కరమందున కంకణంబునున్
నిలుపుచు అశ్వమేధమున నిచ్చెను పండగజేయ నెంచుచున్.
పిలిచి వశిష్ఠునానతిని పెట్టెను శీర్షమునందునమ్రుడై.

రామునవనహయము భూమి వీరులెయున్న
బట్టికట్టవచ్చు పంపుచుంటి
వెంట శత్రుజేతవీరు శత్రుఘ్నుని
అనుచువ్రాసి హయముపనిచె దిశల.

పల్లెలు పత్తనంబులును పార్థివ వీడులు కోటలన్నియుఁ
మెల్లగదాటి కోసల గమింపగవచ్చుచు కాననంబులఁ
చల్లగజేయుచుండ మునిచంద్రులు యుండిన పుణ్యసీమలఁ
పిల్లలతోడనాడు మునిపిన్నలు కట్టిరి అశ్వరాజమున్.

పట్టి కట్టి వీరపటలిని పోగొట్టి
వీరమాతయేమి వీరితల్లి
తక్కువారు ధీరతను గణ్యులాయని
అర్చిరద్రిగుహలు అదరునట్లు.

చావుబ్రతుకు లసలు సహజాలు సృష్టికి
అనుచు చెప్ప చెట్లుఆకురాల్చి
నవవసంతవేళ యవునేని అమృతమ్ము
చిలుక మొగ్గగనుట తెలుపుచుండె.

వీరుడు శత్రుఘ్నుడురా
ధీరుడు భరతుండురాగ తీవ్రశరములన్
గారించి మూర్ఛకొట్టగ
జేరెను లక్ష్మణుడు నిప్పుసెగలుమియుచునున్.

పిన్నలు మిమ్ముజూచునెడ ప్రేమజనించును యుద్ధమేలనో
చిన్నికుమారులార! దయజేసెద పుత్తడి క్రొత్తవస్త్రముల్
మన్నికగల్గు సొమ్ములును మాపురిజేరుడటన్న ధీరుడై
కన్నులు రక్తరోషలను గ్రమ్మగనాడె లవుండు యుగ్రుడై.

భట్టులమా బాపలమా
పట్టగ దానంబు వీరు పని యుద్ధమునన్
కొట్టుట వైరినివేరగ
పట్టిన, ఛీకొట్టి ప్రజలు పకపకనగరే.

భిక్షయేల యుద్ధభిక్ష పెట్టుడుమాకు
తొడవులేల అంబు విడువజూడు
మంతెకాని వందియట్టుల వైరిని
పొగడి దాటిపోవ జగమునగరె.

అన కనలి లక్ష్మణుడు తన
కనులను నిప్పుకలు చింది గాఢజవమునన్
కొని కార్ముకమాలీఢత
గొనయంబున గుణమునించికొట్టె లవుపడున్.

వానిని తేరిపైనునిచి వాజిని గైకొనిపోవుచుండ గో
పానకుసుండు కార్ముకులు ఫక్కనిగ్రమ్మి కరానగ్రుమ్మి భూ
జానిని మూర్ఛపోవునటు సల్పెను నిల్పెను వాజితమ్ముడున్
దీనతకండ్లువిచ్చి కని తిన్నగ నన్నను కౌగలించుచున్.

తమ్ముల మూర్ఛవిన్న రఘుతల్లజుడప్పుడు యుద్ధభూమికిన్
సమ్మతివచ్చి యాకవల సన్నిధినిల్చి యిదేమి వీరలా
మమ్ములనిట్టుచేసి రభిమానము హీనము అస్త్రశస్త్రముల్
వమ్మయిపోయి భాస్కరులవంశము. నేటికి నల్పుజెందెనే.

యజ్ఞకర్తనైతి నే యనిసేయను
బాలులార శుభకపోలులార
నాదుపురికివచ్చి యాదరమందుడు
పేరదేమి మీదు యూరదేమి.

అనుచును రాఘవుండడుగ అక్కజులై తమరేమి క్షేమముం
గనజనుదెంచినారె కనగాస్థలముల్ కులముల్ యెరుంగగా
మనసయె చాలుచాలు నృపమండను లిట్టులసేయ మెత్తురే
కొనదగు కార్ముకంబు జనకోటులు మేటియటంచు మెచ్చగన్.

మాటాడెదు మమునెరుగక
పాటకజనమట్లు రామభద్రుసితోడన్
ఆటలు పాటలు అనుకొని
ఓటమిగని పారిపోవ యోగ్యులపనియే.

గెలుపు పోటములను పలికెదు అప్పడే
భాలీజెప్ప శాస్త్రపండితువలె
రాముడనిన మాత్రమేమేమొ హంసమును
యిత్తుమ నెడిమాట రిత్తమాట.

తాటకజంపి తాడుడని తల్చక పైరిని వాలి డాగుచుఁ
గీటడగించి తాపయిని కిల్బిషమంచని ఎంచకెట్టులో
మాటలతోడ గుట్టుగని మాన్యుని రావణు జంపితేమి నీ
పోటుతనంబు విన్నయెడ పుట్టును భీతెట దాగవచ్చునో.

అనియెడు పిల్లవాండ్రగని అదరబుద్ధి వచించువాక్యముల్
వినకయె వీరులంబ వెనువీరడిమాటలనాడ నేటితో
మనుగడ తీరునంచు ఘనమార్గణ కోటులు నింపవానినిఁ
దునుముచు భూమిపైబడగ ద్రోసిరి వేసిరి బాణసంఘముల్.

రాముని కిరీటముంగొని
తామూనుచు తల్లిజేర ధరణిజ దానిఁ
స్వామిదిగాతెలిసి ముని
స్వామినిగని చెప్పకథను సాంతముగాగఁ.

వరగుణాత్మజ్ఞాన వాల్మీకి చనుదెంచి
సీతతోడ పూశశులతోడ
రాజు తమ్ములకును రామునకుఁగూడ
ప్రజ్ఞగూర్చె మంత్రబలమువలన.

కాళుల వ్రాలు రాఘవుని గైకొని అక్కునజేర్చి రాముడే
ఏలిక తక్కురాజులికనేటికి సర్వసమాన ధర్మముల్
పాలనచేసి నీ ప్రజల పల్కులకై సతి వీడియుంటయే
చాలును అద్దియే ప్రజకు జాతికిగూర్చును తీర్చుకష్టముల్.

జనకునకున్ మహోపకృతిసల్పి నల్పన మోముదమ్మినై
నను తగనెత్తలేక నరనాథుని కాళ్ళను కండ్లనీళ్ళతో
బుణుకుచు నార్ద్రతన్ జరుపు పుత్రులనెత్తి కవుంగలించి యా
జనపతి తోషభాష్పములు జార్చెను శీర్షము కేలదువ్వుచున్.

రాముచాజ్యమగన భూమి నితోధిక
వృద్ధికలుగు ధన సమృద్ధికలుగు
సతియుసుతులు కొలువ సాకేతకేగుము
సకల ప్రజలు తోషసరసిదేల.

కన్నులనిడి తండ్రివిగా
యిన్నాళులు సతినిసాకి యిద్ధసుతులనున్
సన్నుతగుణులను గూర్చితి
కొన్నాళులు మీదుసేవ కూర్చుడుమాకున్.

అనులోముని పలుకులువిని
మునినాథుడు అశ్వమహము ముగిసెడుతరికిన్
చనుదెంచెద నాశ్రమమున
పనిపాటలు దీర్పదగిన ప్రాజ్ఞులనిడుచున్.

రాముని అశ్వమేధముకు రాజులు తేజులు ఫౌజుతోడుతన్
స్వామి హితార్థమై నడువసాగిరి రత్నము లచ్చముత్యముల్
కోమల పాదపీఠికలగూర్చిరి తీర్చెరఖండరాశి, సం
గ్రామములన్ బొనర్చకయె గౌరవభక్తి విధేయచిత్తులై.

కుశలవులకు పరిపాలన
కుశలులకును రత్నపీఠికూర్చి ముదానన్
విశదీకరించె నీతుల
దశరథసుతు డార్యసమ్మతంబగు సరణిన్.

రామునకును పరమాత్మకు
భూమిన కష్టములు తప్పబోవనయింకన్
సామాన్యుల విడచెడునే
తామును సంసర్గరాశి తల మునుకలిడున్.

తామరపై జలబిందువు
గా మనసును త్రిప్పిదవ్వుగా సంశ్రుతులన్
శ్యామల కోమలరూపుడు
తామార్చెను ప్రజలమంన్చె దాక్షిణ్యమునన్.

భూతదయయు నహింసయు
ప్రాతిపదికగాగ రాజ్యపాలనవిధులన్
భూతలి రాఘవదేవుడు
నాతరి కొలువుండె మంత్రినాధులతోడన్.

ఆతరిశోకమెల్ల నిటు లాకృతినందినదన్న భాతి ఖే
దాతిశయానసొగ్గగు ధరామరు డొక్కరుడేగుదెంచి భూ
నేతపదాంబుజములను నెత్తుటికందునునిల్పి సామి ఈ
పాతకమేమి ? నా శిశువు ప్రాణమువీడుటయేమి ? రాఘవా !

శిశుమరణము పశుహరణము
శశిభూషణు నింద్యమేని సామ్రాజ్యమునన్
విశదముగు నా నృపాలుని
పశుధాన్య సమృద్ధసిరులు భస్మమునొందున్.

కన్నుల చందమామ ననుగాచెడి పెన్నిధి జీవగఱ్ఱ నా
చిన్ని నిసుంగు జీవనము జేష్పడపలిక విధు ఈగతిన్
కన్నులు మూసుకొన్నయెడ గాఢవిషాద భయా ర్తిభూతముల్
మిన్నుననుండిదూకి ప్రజ మ్రింగునుపొంగిన ఏవ పెంపునన్.

కాన దాక్షిణ్యఖని నాదు కన్నసుతుని
నాకు నీకున్న రాజ్యంబు నరకమన్న
మాట చాటించువాడను వీటవీట
నా ర్తుడను కావుమా ! దయామూ ర్తి ! రామ !

అని విప్రుడాడ రాఘవ
జననాధుడు జ్ఞానదృష్టి చర్చించియు భా
వనిగని యూరిడిలుండిక
మనిచెద శుభదృష్టి మీది మాపయినున్నన్.

అని కవచంబు కార్ముకము సాహసభూమికి యేగునట్లుగా
కొనిరఘువంశుడు కారడవి ఘోరతపంబొనరించు శంబుకున్
గని అతడాచరించు అఘుకర్మము జాతికి ద్రోహమౌట హీ
నుని శిరమూడ్చె ఆకసమునుండి సుపర్వులు పూలుచల్లగన్.

పాపి శంబుకుండు ప్రాణంబువిడచిన
బ్రాహ్మణార్భకుండు బ్రతికిలేచె
చావు బ్రతుకులిటుల సంధించు పరమాత్మ
చేత దెలియు యెవరిచేతనగును.

ముష్టిదెబ్బనట్టి మూర్ఖుని తపమును
భంగపుచ్చె శిశువు బ్రతుకునిచ్చె
ధర్మవేత్త సత్య తత్వసాధకుడగు
రామచంద్రు డఘువిరాముడగుచు.

బాపడువేడ శూద్రుడని పాపియటంచని నేరముంచుచున్
కోపమునూని శంబుకుని కూల్చెనటందురు జాతిబేధమున్
జూపడు స్వామి సర్వమొకచొప్పునగాంచును పామరుం డెదో
పాపముగట్టి నిందనిడ భార్యను కానలడించిరాడొకో ?

సతియైనను సుతుడైనను
మతిమంతుడు తమ్ముడయిన మాతయొ యైనన్
క్షితినాథుడు తప్పండిన
నితరులవలె దండ నీతి నేర్పు అనగదా ?

దూర్వాసు కోపశిఖలకు
నోర్వంగాలేక అడ్డముండని తమ్మున్
మార్వలుకక విడనాడడె
ఉర్వీపతి రాము నీతికొక యెదురున్నే?

తెలిసి తెలియనట్టి పలువలు రాముని
నిందసేయ కీర్తి కుందువడునె
భానుమీదదుమ్ము పారజల్లిన వాని
కాంతికేమిమచ్చ కలుగగలదు.

ధర్మ మిటుల తూచి ద్రవ్యసంపదమోచి
అపచయంబు మొత్తమవలద్రోసి
భక్తజనులకొంగు పసిడి శ్రీరాముడు
నేలనేలె కూర్మి చాల యేండ్లు.

అమల సౌభ్రాత్ర సౌహార్ద విమల కీర్తి
సర్వసమతను నలరారు సత్యమూర్తి
అర్థి చాతకముల పాలి కమృతస్ఫూర్తి
చారు సుందర శ్రీరామ చక్రవర్తి.

అణచె విప్లవములు సందందుమొలచిన
శాంతిస్థాపనమ్ము జరిపెమిగుల
సామరస్యవేత్త రాముడు కాకేరు
కర్షకులకు పెరటి కల్పకాలు.

# ఫలశ్రుతి

అన్నివిధాల రామనరనాధుని యట్టుల జ్యోత్స్నవెల్గులన్
కన్నులగట్ట శ్రామికుల కష్టపుమేఘము వెన్కపట్టన
భ్యున్నతిగాములై ప్రజను బ్రోచుచు నేటి ప్రజాప్రభుత్వ మా
తెన్నున రామరాజ్యమును దేల్చుత సర్వసమత్వ సుస్థితిన్.

మంగళము రామచంద్రా !
మంగళ మభిరామమూర్తి! మంజులకీర్తీ !
మంగళము జానకీపతి
మంగళమగు మహికి ప్రజకు మధుకైతలకున్.

మంగళం మహత్

# వేడికోలు

చందమామ చల్లచల్లని వెన్నెలలు వెదజల్లటం మధువ్రతాలు తీయతీయని తేనెలనీయటం, ఘనాఘనాలు సన్నసన్నని వానజల్లులు విసరటం ప్రకృతిసిద్ధం, సహజం, సాంప్రదాయం, ఐనట్టు వదాన్యతా దాతృత్వాలు భారతీయులకు స్వతసిద్ధాలు, సహజాలు; ఈ చిన్నారి కావ్య సుందరి చిరు మందహాసాలు, పసిడి పలుకులు, చూపి వినిపించి జిగ్గు నిగ్గులు తొణికించటానికి చేదోడువాదోడుగా సహకరించిన త్యాగ ధనులకు గుప్తదానకర్ణులకు నాహృదయపూర్వక నమోవాకాలు. వారి సుధా మధురాక్షరాలు పుస్తక ముఖంగా వెలువరించనందుకు వారి మంజుమంజుల హృదయాలను క్షమాభిక్ష గోరుకొంటున్నాను——

# రామరాజ్యము

రచన: "మధుర మధురాలు"

విళంబి — కార్తీకము.

[కాపీరైట్ రిజిష్టర్డు] మూల్యము: రు. 1—25

వెలయువారు:—

శ్రీ. వావిలికొలను లక్ష్మీనరసింహారావు,
(ప్రకాశ నగర్)
న ర స రా వు పే ట.

వాణీ ప్రెస్, నరసరావుపేట.
(గాంధీ చౌక్)